సిద్ధేంద్రయోగికృత

# భామాకలాపము

ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ
కళాభవన్, హైద్రాబాద్ - 4

# తొలి పలుకు

ప్రాచీనములైన నాట్య - నృత్య - సంగీత శాస్త్ర గ్రంథములు సంస్కృత భాష యందే యుండుట అందరెరింగిన విషయమే. వాటి ప్రాశస్త్యము ప్రతిస్రష్టకు విదితము. వాటి అవసరము మాత్రము చిన్న నుండి పెద్ద వరకు సమానమే. ఇప్పటిలో చాల కొద్దిమంది మాత్రమే సంస్కృత భాషాజ్ఞానము కల వారుంటచే, ఈ గ్రంథములను ఆంధ్ర భాషలోనికి అనువదింప జేసిన సర్వులకు చాల ఉపయోగకరముగా నుండునను సంకల్పముతో ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ ఈ పనికి పూను కొనవలయునని చిరకాలము క్రిందటనే సంకల్పించినది. కాని ఎప్పటికప్పుడు ధనాభావము ఈ మా సంకల్పము నరికట్టుచు వచ్చినది ఎట్లో ఈ పని అనివార్యముగా చేయు పూనికతో, తొలుదొల్త శార్ఙ్గదేవుని "సంగీత రత్నాకరము" అను విశిష్ట సంగీత గ్రంథానువాదమునకు గడంగి, సులువగు మార్గ మన్వేషించి, సర్వులకు అందుబాటులో నుండునట్లు అకాడమీ మాస పత్రిక "నాట్యకళ"లో కొద్ది కొద్దిగ ప్రచురించుచు దీని కొక రూపము నిచ్చుట జరిగినది. నాలుగు భాగములుగా ప్రచురింప నమకట్టిన సంగీతరత్నాకరము నందలి తొలి భాగమును ఇటీవలనే సహృదయుల కరకమలములందు సమర్పింప గలిగినందులకు సంతోష పడుచున్నాము. తక్కిన మూడు భాగములను క్రమముగా వెలువడగలవు.

అర్వాచీన కాలమున, ఆంధ్ర భాషలో కూడ కొన్ని ఉత్త్తమైన నాట్య - నృత్య - సంగీత గ్రంథములు వెలసినవి. కొన్ని చాలకాలము క్రిందట ముద్రితములైనవి. కాని, ఆ ణముల ప్రతు లిప్పుడు లభ్యము లగుట లేదు. అంతియే కాదు ఆ ప్రతులను సంస్కరింపవలసిన అవశ్యకము కూడ గలదు. అట్టి ఆంధ్రగ్రంథములను కూడ, పండితులచే సంస్కరింపజేసి, ప్రచురింపవలయునని అకాడమీ తలపెట్టినది. ఆ తలంపు తొలి ఫలమే ఈ 'సిద్ధేంద్రుని భామాకలాపం' ప్రచురణము. ఇది కూడ "నాట్యకళ"లో తొలుత ప్రచురింపబడి యున్నది ఈ 'భామాకలాపము'ను సంస్కరించిన శ్రీ మహాకాళి లక్ష్మీనరసింహంగారికి, ముద్రణ ప్రతిని తయారుచేసి యిచ్చిన శ్రీ బంధా కనకలింగేశ్వరరావుగారికి మా ధన్యవాదములు.

ప్రశస్తములైన ఆంధ్ర గ్రంథముల శీర్షికలో రెండవ ప్రచురణముగా శ్రీ సుబ్బరామ దీక్షితులవారి "సంగీత సంప్రదాయ ప్రదర్శిని"ని సంస్కరించి, పునర్ముద్రించుటకు సంకల్పించి యున్నాము. త్వరలోనే దీని ముద్రణము ప్రారంభము కాగలదు.

ఈ మా ప్రచురణములు సహృదయుల ఆదరాభిమానములకు పాత్రములు కాగలవని విశ్వసించుచున్నాము.

పసల సూర్యచంద్రరావు
ప్రెసిడెంట్
ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ

# సిద్ధేంద్రయోగి[1]

ఆ (సంబెట) గురవరాజు ప్రభుత్వములో ప్రజలకు అతిదారుణ శిక్ష చేయిస్తూ వుండేవారు. ప్రజల వద్ద ద్రవ్య ఆకర్షణ చేసే యెడల త్వరగా సొమ్ము యివ్వకపోతే స్త్రీలను తీసుకవచ్చి స్తనాలకు చిరుతలు పట్టించేవారు. అలాగంటి దినములలో వినుకొండ, బెల్లంకొండ తట్టున కూచిపూడి అనే గ్రామం నుంచి బ్రాహ్మణులు భాగవతులనే వేషధారులు కీర్తన నిమిత్తమై యీ స్థలమునకు (సిద్ధవటం సీమకు) వచ్చివుండి సంబెట గురవరాజు యొక్క దారుణప్రభుత్వం చూచి యిక్కడ నుండి లేచిపోయి విద్యానగరమునకు పోయి అక్కడ వీరనరసింహరాయలు రాజ్యపరిపాలనం చేస్తూవుండగా భాగవతులు దర్శనం అయి కేళిక అడుగగా శలవు యిచ్చినారు. కూచిపూడి మేళంవాండ్లు చాలా విద్యావంతులని ప్రసిద్ధిగా వినికిడి వున్నందున రాయలవారు స్త్రీలు సహా చూడవలెనని నగర్ల వద్ద దివాణములో కీర్తనకు శలవు యిచ్చినారు. అక్కడ కీర్తన వినికి చేసేటప్పుడు సంబెట గురవరాజు వేషం వేసుకొని వొకడు, యిద్దరు బంట్రోతుల వేషం వేసికొని, వొకడు స్త్రీవేషం వేసుకొని, సంబెట గురవరాజు వలెనే ఆ వేషగాడు కూర్చుండి, రాయల సమక్షమందు ఆ స్త్రీయొక్క స్తనాలకు చిరుతలు పట్టించి

---

1. "భారతి" (జనవరి, 1960) సౌజన్యముతో.

సొమ్ము యిచ్చవమని తహశీలు చేసినట్లు వినికి చేసినారు.

"అప్పుడు రాయలవారు చూచి అది యేమని అడుగగా ముఖ స్తులయినవారు భాగవతుల మొఖతా ఆ వర్తమానము తెలిపి... వున్నవం శాయగా చాలా తీక్షణం చేసి, మరునాడు ఉదయమందు ఆ సంగతి తీరుగా జ్ఞాపకం సేయమని ముఖస్తులైన వారికి అజ్ఞ యిచ్చినారు. ఆ రాత్రి కీర్తన సాంతమయిన వెనుక తెల్లవారిన పిమ్మట రాయలవారు కాలోచిత కృత్యములు తీర్చుకొని, ఆస్థాన మునకు వచ్చి.........2"

పై కథనము మెకంజీ సేకరణలలోని మాచుపల్లి కైఫీయత్తు నందలి ఒక భాగము. దీనినిబట్టి కూచిపూడి బ్రాహ్మణ భాగవతులు వీరనరసింహ రాయల కాలము (క్రీ. శ. 1506–1509) నాటికే, అనగా క్రీ. శ. 1500 నాటికే విద్వాంసులుగా ప్రసిద్ధి నందినారని, వారి మేళమొకటి సంచారములు చేయుచు దూరదేశములందుగూడ ప్రదర్శనము లిచ్చుచున్నదనియు స్పష్టమగుచున్నది. ఇది విమ ర్శకు లందరికును తెలియును కాని రాయల యెదుట కూచిపూడి భాగవతు లానాడు ప్రదర్శించిన కేళిక లేదా కీర్తనయొక్క స్వరూ పమును గూర్చి మాత్ర మెవ్వరును బాగుగా ఆలోచించినట్లు కన్ప ట్టదు. కూచిపూడివారు సంబెట గురవరాజు దశ్చర్యలనే నాటక ముగా కల్పించి ఆ రాత్రి ప్రదర్శించినారని విమర్శకులు అభి

---

2. చూ. (1) Studies in the History of the Third Dynasty of Vijayanagara by Dr. N. Venkata Ramanayya, Appendix C. PP. 462-63.

(2) శ్రీ దిగవల్లి వేంకటశివరావు "కథలు-గాథలు" 4వ భాగము - 151 – 52 పుటలు.

(3) "నాట్యకళ" డిసెంబరు. 1957 సంచిక – పుటలు 27-28.

ప్రాయ పడినారు. కాని, ఈ యూహ సమంజసనుగా కన్పట్టదు. ఇచ్చట కేళిక లేదా కీర్తన అనునది సుప్రసిద్ధమైన భామాకలాపమే. కూచిపూడి భాగవతు లానాడు రాయలసమక్షములో భామాకలాపమునే ప్రదర్శించినారు. ప్రదర్శనము మధ్యలో గుసవరాజా దుశ్చర్యలకు పరాకాష్ఠ అనదగిన ఒకదృశ్యము (స్త్రీల స్తనములకు చిరుతలను పట్టించుట) మాత్రమే ప్రదర్శించినారు. రాయలవారు విషయమును గ్రహించిన పిమ్మట, కేళిక మరల యథాప్రకారము సాగినది. ఆ యీ విషయములను క్రమముగా నిరూపింతును.

కూచిపూడి అను గ్రామము బెజవాడకు సుమారు 32 మైళ్ళ దూరములో నున్నది. కూచిపూడి అను పదము "కుచేలపురి" అను పదమునకు రూపాంతరమని కొందరు తలంచు చున్నారు. ఇది సమంజసముగా కన్పట్టదు. "కుశీలవులు" అను పదమునకు నటన ర్తకు లని యర్థము. కుశీలవులు నివసించు పురి కాన దానికి "కుశీలవపురి" అను పేరువచ్చియుండును. ఈ పదము ఈ నోట, ఆ నోట వాడుకలో భ్రష్టమై క్రమముగా కుచీలపురి, కూచిపూడి అయి యుండును.

కూచిపూడి పరిసరములు చారిత్రకముగా చాలా విశిష్టములైనవి. కూచిపూడికి సుమారు ఆరుమైళ్ళ దూరములో ఉన్న శ్రీకాకుళము క్రీ. పూ. 2వ శతాబ్ది ప్రాంతములందే శాతవాహనుల రాజధానిగా సుప్రసిద్ధమైనది. నాడు శ్రీకాకుళమున 300 దేవదాసీ కుటుంబము లుండెడివట. కూచిపూడికి అనతిదూరములో నున్న ఘంటసాల సుప్రసిద్ధమైన బౌద్ధక్షేత్రము. కృష్ణకర్ణామృత కర్తయగు లీలాశుకుడు శ్రీకాకుళ వాస్తవ్యుడే యని విశ్వసింపబడు చున్నది. క్రీ.శ. 1253-54 లో "నృత్తరత్నావళి" యను ఉత్తమ నృత్యశాస్త్ర

గ్రంథమును రచించిన జాయపసేనాని శ్రీకాకుళ మండలము లోనిదగు చేబ్రోలు నివాసి. క్రీ.శ. 17వ శతాబ్దిలో పదకర్తగా సుప్రసిద్ధుడయిన క్షేత్రయ్య కూచిపూడికి సమీప గ్రామమగు మొవ్వ గ్రామవాస్తవ్యుడు. ఇట్లు క్రీ.పూ. 2వ శతాబ్దికి ముందునుండియు కూచిపూడిపై నృత్యకళాప్రభావము కలదని చెప్పవచ్చును.

సిద్ధేంద్రయోగి అనెడి మహానుభావుడు భామాకలాపమును రచించి, దానిని కూచిపూడివారికి నేర్పెననెడి ఐతిహ్యము పరంపరాగతముగా వినవచ్చుచున్నది. కాని, సిద్ధేంద్రయోగి కాలమును గూర్చిన చారిత్ర కాధారము లెవ్వరికిని లభించలేదు. అయినను వీరనరసింహరాయల యెదుట భామాకలాపమే ప్రదర్శింపబడెనని అంగీకరించినచో, దానికి మూలపురుషుడగు సిద్ధేంద్రుడు విధిగా క్రీ.శ. 16వ శతాబ్దికి పూర్వుడగును, అనగా క్రీ.శ. 14వ శతాబ్దికో, లేదా 15వ శతాబ్దికో చెందినవా డగును.

కాని, సిద్ధేంద్రయోగి 17 వ శతాబ్ది ఉత్తరార్ధమందున్న వాడనియు, అతడే స్వయముగా గోల్కొండ నవాబగు అబుల్ హసన్ కుతుబ్ తానాషా (క్రీ. శ. 1672-1687) చేత కూచిపూడిని అగ్రహారముగా కూచిపూడివారికి ఇప్పించెననియు, క్షేత్రయ్య (విజయరాఘవ నాయకుని కాలము—క్రీ.శ. 1633-1673) పదాభినయము ననుసరించియే సిద్ధేంద్రయోగి భామాకలాపమును సృష్టించెననియు, సిద్ధేంద్రయోగికి పూర్వకాలమందు కూచిపూడివారు శతవిధ శివలీలా నాట్య పద్ధతులను నృత్యము చేయుచు గ్రామగ్రామములను తిరుగుచుండిరనియు ఆచార్య శ్రీ విస్సా అప్పారావుగారు మొదలగువారు వ్రాసియున్నారు. ఈ అభిప్రాయములను పరిశీలించవలసి యున్నది.

గోల్కొండ నవాబు కూచిపూడిని అగ్రహారముగా నొసంగిన శాసనములో సిద్ధేంద్ర యోగి ప్రసక్తియే లేదని తెలియుచున్నది. కాగా, సిద్ధేంద్రుడు 17 వ శతాబ్ది ఉత్తరార్ధమందుండెననెడి విషయము పరాస్తమగుచున్నది.

శ్రీ విస్సా అప్పారావుగారి అభిప్రాయమును అనుసరించి క్షేత్రయ్య యును, సిద్ధేంద్రయోగియును సమకాలికులు కావలసి యున్నారు. అట్టియెడ శ్రీ శ్రీనివాస చక్రవర్తిగారు పేర్కొన్నట్లు* సిద్ధేంద్రయోగి క్షేత్రయ్య పదాభినయము ననుసరించెనని చెప్పుట కంటె క్షేత్రయ్యయే సిద్ధేంద్రుని భామాకలాపములోని కీర్తనలను ఒరవడిగా పెట్టుకొని పదాలు రచించెనని ఏల చెప్పరాదు? ఇంతకును సిద్ధేంద్రయోగి క్షేత్రయ్యకంటె చాల ప్రాచీనుడనుటయే సత్యసమ్మతము కూచిపూడియును, క్షేత్రయ్య నివాసమగు మొవ్వయును సన్నిహిత గ్రామములు. క్షేత్రయ్య చిన్నప్పటి నుండియు కూచిపూడి పద్ధతిలో నృత్య సంగీతములను అభ్యసించి యుండును, అందుచేతనే కవితాశక్తియును కలవాడు. అతడు దేశసంచారములో విజయరాఘవనాయకుని సందర్శించినప్పుడు, ఆ ఆస్థానములోని రాజనర్తకీమణులను చూచి, వారి అభినయముల కొరకు పదములను రచించియుండవచ్చును. లేదా అంతకు ముందునుండియు పదకర్తయే అన్నను బాధలేదు.

ఇక సిద్ధేంద్రునకు పూర్వకాలమందు కూచిపూడివారు శతవిధ శివలీలా నాట్య పద్ధతులను ప్రదర్శించెడివారనుటకు తగిన ఆధారములు లేవు. ఇందును గూర్చి శ్రీ శిష్టా రామకృష్ణశాస్త్రిగారు

* "కూచిపూడి వీధినాటకం" – నాట్యకళ, డిసెంబరు 1957, పుట 26.

కూచిపూడి భాగవతులను గూర్చిన వ్యాసములో[4] సమాధాన మొసంగియున్నారు.

పాల్కురికి సోమనాథుడు బసవపురాణములో (పుట-26) నాటి నర్తకులను కొందరిని పేర్కొనియుండెను.

"వేడుకఁగోలాట మాడెడువారుఁ
గూడలి త్రిపురాంతకుని కొల్చువారు;
గెడఁగూడి పసిఁడి గిర్రిట కేళికలను
గడునొప్పుసొన్నలికపురంబువారు;
జేరువనాడెడు పేరణివిధము
సౌరాష్ట్రినాయకు సంప్రదాయంబు
వేడుకఁ బ్రతిజోకలాడెడువారుఁ
గూడలి సంగయ్య కొలువునర్తకులు;
బాడుచు నట విడ్లపై గజ్జెపడవు
లాడెడువారు రాయనికొల్చువారు."

ఇచ్చట కాని, బసవపురాణములో మరి యెచ్చటకాని కూచిపూడి వారి ప్రశంస కన్పట్టదు విద్వాంసులైన కూచిపూడివారే శివలీలా నాట్యములందు ప్రసిద్ధులై యున్నచో వారినికూడ సోమనాథుడు తప్పక పేర్కొనియుండును. పండితారాధ్య చరిత్రయందలి నృత్య వర్ణనలో కూచిపూడివారి ప్రసక్తిలేదు. అందుచే సోమనాథుని నాటికి (క్రీ. శ. 13వ శతాబ్ది) కూచిపూడివారు నాట్యములు చేయు టయే లేదని నిర్ధరింపవచ్చును. కూచిపూడివారు మొదటినుండియు

4. "కూచిపూడి భాగవతులు – యక్షగాన నాటకములు" 'Annals of Oriental Research' of the university of Madras, Vol. xv-1958-59. P. 66.

వైష్ణవ భాగవతులుగానే ప్రసిద్ధిచెందిరి కాని మొదట శైవభాగవతులై పిమ్మట వైష్ణవ భాగవతులైనట్లు చెప్పుటకు ఎచ్చటను ఆధారములు లేవు. కావున "కొందఱు సిద్ధేంద్రయోగి నారాయణాశ్రమి యను యతి శిష్యుడనియు, క్రీ. శ. 1100 ప్రాంతము వాడనియు నందురు. కాని, క్రీ.శ.1100-1300 ప్రాంతము వీరశైవ మత విజృంభణ కాలమగుటచేతను కూచిపూడి భాగవత సంప్రదాయము వైష్ణవభక్తి సంప్రదాయ మగుటచేతను ఇది క్రీ. శ. 1300 తర్వాతనే ప్రచారములోనికి వచ్చి యుండవచ్చును" అని శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు వ్రాసినది¹, సత్యసమ్మతముగా కన్పట్టుచున్నది.

క్రీ శ. 12, 13 శతాబ్దముల నాటికి పవిత్రమైన దేవదాసీ సంప్రదాయమును, ఉత్తమమైన రాజనర్తకీ సంప్రదాయమును పతితములైనవనియు, అసంస్కారులైన గ్రామీణుల వీధినాటక ప్రదర్శనములు హేయస్థితిలో ఉన్నవనియు, అందుచే నటనర్తకులు నిందితులైనా రనియు, అట్టి స్థితిలో నాట్యకళోద్ధరణమునకు పురుషులును బ్రాహ్మణులును అగు కూచిపూడివారు పూనుకొని వీధిభాగవతము లాడుటకు మొదలుపెట్టి యుందురనియు, అటు పిమ్మట సిద్ధేంద్రుడు వారికి భామాకలాపమును నేర్పెననియు కొందరు తలంచుచున్నారు. అనగా కూచిపూడివారు సిద్ధేంద్రునకు పూర్వమే నటులై వీధినాటకములనో, లేదా యక్షగానము లనో ప్రదర్శించు చుండెడివా రనియు, అప్పుడు వారికి సిద్ధేంద్రుడు శాస్త్రీయమైన నృత్య - గానములను నేర్పి భామాకలాపమును బోధించెననియు వీరు తలంచుచున్నారు. ఈ తలంపు సత్యసమ్మతము కాదు.

---

1. 4-3-1959 తేదీన వారు నాకు వ్రాసిన లేఖ నుండి.

తెలుగు దేశమందు వీరశైవమత విజృంభణ కాలములో నృత్యనాటకములు సాంఘిక కళగా రూపొందినవి. ఆ మతవిజృంభణము అణగుటతో ఈ కళలు అసంస్కారులైన తక్కువజాతి వారి పాలబడినవని ఊహించుట కవకాశము కలదు. అట్టి స్థితిలో నటనర్తకులు నింద్యులగుట సహజమే. 13వ శతాబ్ది మధ్యలో, కాకతీయుల కాలములో, నృత్యకళకు రాజాస్థాన ప్రవేశ గౌరవమును కలిగించుటకు ప్రయత్నములు జరిగినవి. గణపతి దేవమహారాజు బావమఱదియగు జాయపసేనాపతి స్వయముగా నాట్య విద్యా ధురంధరుడై క్రీ శ. 1253-54లో "నృత్తరత్నావళి"ని రచించెను. అసలీ ఉద్యమమునకు బ్రాహ్మణులు పట్టుగొమ్మలై నారు. జాయపసేనాపతి గురువు బ్రాహ్మణుడైన గుండామాత్యుడట. వెన్నెలకంటి అన్నయ తండ్రియును, అన్నయ రచించిన షోడశ కుమార చరిత్ర కృతిపతియును అయిన సూరామాత్యుడు సంగీత సాహిత్య ధురంధరుడేగాక "నూత్నభరతాచార్యు"డట. ఈ రెండు ఉదాహరణములును చాలు, ఆనాడు నాట్యకళను బ్రాహ్మణులు చేపట్టినారనుటకు. సిద్ధేంద్రయోగియును అట్టివాడే అయియుండును. అతడు పూర్వజన్మ సంస్కార బలముననో, భగవత్కృప వలననో, గురుశుశ్రూష వలననో వాగ్గేయకారుడగుటయే గాక, నృత్యకళా దురంధరుడును అయి, క్రొత్తమార్గమును త్రొక్కి, జాయప లక్షణమును రచింపగా, తాను లక్ష్యముగా భామాకలాపమును రచించి యుండును. ఈ రచనలో జయదేవుని గీతగోవిందము కూడ మార్గదర్శకమై యుండవచ్చును.

కాకతీయరాజ్య పతనానంతరము శ్రీకాకుళ మండలము కళింగ రాజుల ప్రభావమునకు లోనైనది క్రీ. శ 1280 ప్రాంతముల

నరహరితీర్థుడను కళింగరాజుల ప్రతినిధి శ్రీకాకుళమున గీత గోవిందమును ప్రచారమొనర్చినట్లు తెలియుచున్నది. నరహరి తీర్థుల శిష్యుడు గోపాలకృష్ణ సరస్వతి గొప్ప వాగ్గేయకారుడు.

పాల్కురికి సోమనాథుని వర్ణనలను బట్టి నాడు నృత్యములు వేరుగాను, నాటకములు వేరుగాను ప్రదర్శింపబడు చున్నవని స్పష్టమగు చున్నది. ఆ నాటకములు వీధినాటకము లగుట నిస్సంశయము. నాటికి 'భాగవతము'లను పేరు వానికి లేదు; మరియు కూచిపూడివారి నేటి నృత్యనాటకములవలె నా డా వీధినాటకములు శాస్త్రీయనృత్య-గాన సహితములై యుండెడివని కూడ చెప్ప జాలము. ఇంక నృత్యములు వారాంగనలచే చేయబడు చుండెడి వని చరిత్రల వలన విశదమగు చున్నది. ఇట్టి స్థితిలో బ్రాహ్మణులు ప్రప్రథమముగా నృత్యకళను మాత్రమే చేపట్టినట్లు పై ఉదాహరణములనుబట్టి చెప్పగలము. శాస్త్రనిష్ణాతులైన బ్రాహ్మణులు కొందరీ నృత్యమేళములకు గురువులై యుందురు. ఇంక సిద్ధేంద్రయోగి మాత్రము మాత్నమార్గమును త్రొక్కెను. భామా కలాప రచనమునకు మోక్షదృష్టియో, లేదా మరేదియో ప్రేరక మైనను అది ఒక అపూర్వసృష్టి. కళావేత్తయే గాక తపస్సంపన్ను డగు నాతడే అట్టి రచన చేయగలడు. "నా నృషిః కురుతేకావ్య" మ్మను సూక్తి ఇప్పట్ల మాటికినూరుపాళ్ళు అన్వర్థము.[6]

నాట్యశాస్త్రమున పూర్వరంగ విధికి సంబంధించి తొమ్మిది అంతర్యవని కాంగములును, పది బహిర్యవని కాంగములును వర్ణితములైనవి భామాకలాప ప్రవర్తన ప్రారంభమున సాంగ

---

6. శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి 'ఏకవీర' లోని వర్ణనలను చదువుడు. పుటలు - 165-16?.

మైన ఈ పూర్వరంగ విధినంతటిని కూచిపూడి వారు పాటింతురు. ఈ భామాకలాపము నృత్యప్రధానమయినది గాన, ఇది ఉపరూపక జాతికి చెందియున్నది. అందున, 'శ్రీగదితము' అనెడి ఉపరూపక లక్షణమున కిది సరిపడుచున్నది. ఆ యా లక్షణ గ్రంథము లందు శ్రీగదిత లక్షణ మీ క్రింది విధముగా నున్నది—"పదార్థాభినయాత్మక మయిన ఉపరూపక జాతికి చెందినది. నాయకుడు ప్రసిద్ధుడు; ఉదాత్తుడు ఏకాంకము. ఉదాత్త వచనాన్వితము. విప్రలంభరస ప్రాయము. లాస్యాంగ బహుళము. కులాంగన సఖియెదుట తన పతియొక్క శౌర్యధైర్యాది గుణములను పొగడును; లేదా విప్రలబ్ధయై పతిని ఉపాలంభించును. ఈ లక్షణము లన్నియును భామాకలాపమునకు సరిపోవుచున్నవి

తన నూతన రచనమును ప్రయోగింప గలవారి కొరకు సిద్ధేంద్రుడు అన్వేషణ మొదలుపెట్టెను. ఆ ప్రయత్నములో కూచిపూడి వారు ఆయన కంటబడి యుందురు. కూచిపూడి బ్రాహ్మణు లందరును వేదాధ్యయనపరులు, తపస్సంపన్నులు, యజనయాజన పరతంత్రులు, సామగానమున సాటిలేని మేటులు. కూచిపూడి బాలుర సుకుమార దేహములును, కమ్మెచ్చులు తీసిన కంఠస్వరములును సిద్ధేంద్రుని ఆకర్షించినవి. అంతట అతడు పెద్దలను అంగీకరింప జేసి, వారి అనుమతితో భగవత్సన్నిధానములో కూచిపూడి బాలురకు నృత్యశిక్షణమును ఆరంభించెను అదియే తెలుగువారికి గర్వకారణ మగు "కూచిపూడి నాట్యకళ"కు నాందీపూజ జరిగిన శుభ ముహూర్తము.

సిద్ధేంద్రయోగిని గూర్చిన ఐతిహ్యములలో పై విషయములను వివరించెడి కథయును కలదు. అసలు భామాకలాపము తమ కీ విధముగానే లభించెననియు, కూచిపూడి నాట్యకళా ప్రారంభ

మరియే అరియు కూచిపూడివారి విశ్వాసము.[7] కావున, సిద్ధేంద్రునకు పూర్వమే కూచిపూడివారు వీధినాటకములను ప్రదర్శించుచుండెడివా రని చెప్పుటకు తగిన ఆధారములు లేవు. సిద్ధేంద్రుని ప్రేరణము వలననే కూచిపూడి వారు నర్తకులును, భాగవతులును అయినారు కాని, తామగా కళోద్ధరణమునకు పూనుకొనలేదు. ఏ యుద్యమమునైనను పదిమందియును కలిసి ప్రారంభించుట సాధారణము కాదు. ఎవరో ఒకరు నాయకుడైనచో తక్కినవారు అతని ప్రభావమునకు లోనై అతనినే అనుసరింతురు. అట్లే నృత్యకళోద్ధరణమనెడి ఉద్యమమునకు నాయకుడు సిద్ధేంద్రుడు, ఆయన ప్రభావమునకు లోనైన కూచిపూడి బ్రాహ్మణులు భామాకలాపమును నేర్చి తెలుగులో నృత్యకళకు ఎనలేని కీర్తిని చేకూర్చినారు. అట్లు నర్తకులైన వీరిని ప్రజలానాడు బహిష్కరించుట కవకాశమున్నది. కాని అట్టి బహిష్కారము లేకుండు నట్లుగా సిద్ధేంద్రుడు శ్రీ శృంగేరి పీఠాధిపతుల (నరహరి తీర్థులవారు నాడు పీఠాధిపతులు) ఆదేశమును సంపాదించెనట. ఇట్లు సర్వసన్నాహములను పూర్తి అయిన తరువాత కూచిపూడివారును తమకు అయాచితముగా లభించిన క్రొత్తకళ యందు గౌరవాదరములు గలవారై సిద్ధేంద్రుని యెడల కృతజ్ఞతాబద్ధులైనారు. అంతట సిద్ధేంద్రుడు, తన జీవిత సర్వస్వమైన భామాకలాపము చిరకాలము వర్ధిల్లవలె ననెడి కోరికతో కూచిపూడివారి నుండి క్రిందివిధముగ వాగ్దానమును పొందెను- "ఆ గడ్డమీద పుట్టిన ప్రతిబిడ్డకును (మగ పిల్లవానికి) సిద్ధేంద్రుని పేరు చెప్పి, ముక్కు కుట్టి, కాలికి గజ్జె

7. శ్రీ వేదాన్తమ్ పార్వతీశమ్ గారి 'భాగవతుల కూచిపూడి' అనెడి కావ్యఖండమును చూడుడు.

కట్టవలయును. స్త్రీలు వేషము వేయరాదు. ఇంక పురుషుడు మాత్రము అత దే వృత్తిలో ఉన్నను సరే ఒకసారి అయినను స్వామి సన్నిధిని భామవేషమును ధరించి తీరవలెను" కూచిపూడి వారును ఈ నియమమును విధిగా పాటించినారు.

ఈ విధముగా క్రీ శ. పి 14వ శతాబ్ది ప్రారంభములోనో భామా కలాప ప్రదర్శనము ఆరంభమైనది. కూచిపూడివారు దేశదేశములు తిరిగి ప్రదర్శనములు జరుపసాగిరి. అంతకుముందు నృత్యములను నాటకములను ప్రజలు వేర్వేరుగానే ఎరుగుదురు. కాని ఇందు ఆ పద్ధతులు రెండును సమన్వయముచేసి, పండిత పామర రంజక మైన ఒక క్రొత్త పద్ధతి రూపొందినది. ఈ ప్రదర్శనము 16వ శతాబ్ది ప్రారంభములో వీరనరసింహరాయలు విక్కిరి మక్కువతో చూచెను, ఈవిధముగా ఈ ప్రదర్శనములు 18వ శతాబ్ది వరకును సాగినవి; అప్పటికి ఈ ఒకే ప్రదర్శనమును పదే పదే చూచు టకు ప్రజలును, ప్రదర్శించుటకు కూచిపూడివారును కూడ విసిగి యుందురు. అప్పుడు వారు నృత్య నాటకములను చేపట్టినారు. అంతియేకాని వారు మొదటినుండియు నాటక ప్రదర్శనముల నెరుగరు.

ఆంధ్రుడును, కృష్ణలీలాతరంగిణి కర్తయు అయిన శివనారా యణతీర్థులు (క్రీ. శ. 1580-1680) సిద్ధేంద్రయోగికి గురువనెడి ఐతిహ్య మొకటి ప్రచారములో నున్నది. ఈ నారాయణతీర్థుల వారు గుంటూరు మండలములోని కాజగ్రామ నివాసియనియు, దగ్గరలోనే ఉన్న కూచిపూడిలో కూడ కొంతకాలము నివసించె ననియు విమర్శకులు అభిప్రాయపడినారు. ఈ విషయములు నిజ ములే అయినను ఆయన సిద్ధేంద్రుని గురువనుటకు తగిన ఆధార

ములు మాత్రము లేవు. ఇరువురును సమకాలికులు కూడ కాదు. కొంతకాలము కూచిపూడిలో నివసించిన తీర్థనారాయణయతి యును క్షేత్రయ్యవలెనే నృత్య గానములయందు దిట్ట అయి యుండును. ఆయనపై భామాకలాప ప్రభావము కలదు. అది ప్రేరకమగుటచేతనే ఆయన సంస్కృతములో కృష్ణలీలా తరంగి ణిని వ్రాసియుండునని నమ్ముచున్నాను. తీర్థులవారు తరంగములలో "సిద్ధనారాయణ తీర్థసేవిత శ్రీపాదం", అనియు "శివనారాయణ తీర్థ సిద్ధానందదాయకం" అనియు "సిద్ధ'' పదమును మూడు నాలుగుచోట్ల తన పేరుతో జోడించుకొని యుండెను. దీనిని బట్టి సిద్ధేంద్రుడును, తీర్థులవారును ఒక్కరే అని కొందరును, తీర్థుల వారు ప్రియశిష్యుడగు సిద్ధేంద్రుని (సిద్ధప్ప) నామము నావిధ ముగా స్మరించెనని మరికొందరును తలంచుచున్నారు. సిద్ధేంద్రుని కంటె తీర్థులవారి కృష్ణలీలా తరంగిణీ రచనకు ఇట్లనుట భామాకలాపమే ప్రేరకమయ్యెననియు, ఆ విధముగా సిద్ధేంద్రుడే తీర్థులవారికి పరోక్షగురువనియు, 'సిద్ధ' పదమును గౌరవపురస్స రముగా తీర్థులవారు స్మరించిరనియు చెప్పుట సత్యసమ్మతము కాగలదు.

తీర్థులవారు, సిద్ధేంద్రుడును ప్రత్యక్ష గురు శిష్యులు కారను టకు తీర్థులవారుకూడ పారిజాతాపహరణ కథను యక్షగానముగా రచించియుండుటకూడ బలము నొసంగుచున్నదని చెప్పవచ్చును. ఇరువురును ఒక్కరే అయినను, లేదా ఒకరింకొకరికి ప్రత్యక్ష

8. శ్రీ బాలాంత్రపు రజనీకాంతారావుగారి ''ఆంధ్ర వాగ్గేయ కారచరిత్ర చరిత్రము'ను [1958] చూడుడు. పుటలు 182-88, 195, 198-99.

షుగా గురువు శిష్యులైనను రెండు రచనలు బయలుదేరవలసిన అవసరములేదు. తీర్థులవారు ఆంధ్రులైనను బహుదేశ సంచార మొనర్చి, చివరకు దక్షిణదేశమందలి తిరుప్పందుత్రిలో (మేలట్టూరునకు సమీపమున) సిద్ధిని పొందినారట. తీర్థులవారికి కొంచెము ముందుగానే, అనగా అచ్యుతప్ప నాయకుని కాలములో ఆంధ్ర కుటుంబములు కొన్ని దక్షిణదేశమునకు వలసపోయి, అచ్యుతప్ప నాయకుని ఆదరణముతో మేలట్టూరునందు స్థిరపడి అచ్చట తెలుగు యక్షగానముల ప్రదర్శనమునకు దోహద మొసంగియున్నారు. వారికి కొంచెము తరువాత తీర్థులవారు దక్షిణదేశమునకు వెడలియుందురు[9]. అట్లు వెళ్ళి దక్షిణదేశములో స్థిరపడిన తరువాతనే శ్రీ రజనీకాంతారావుగారు పేర్కొన్నట్లుగా, [10]మేలట్టూరు భాగవతుల కొరకు తెలుగులో పారిజాతాపహరణ యక్షగానమును వ్రాసియుండును. ఈ రచనలో సిద్ధేంద్రుని భామాకలాప ప్రభావము కొంతవరకు కన్పట్టగలదు.

సిద్ధేంద్రుని భామాకలాపమునకు కూడ పారిజాత మను పేరు కలదు. కాని నిజమున కందులో పారిజాతాపహరణమునకు సంబంధించిన కథ యేమాత్రమునులేదు. తీర్థులవారు మాత్రము దానినే ప్రధానముగాచేసి కథాసంవిధానములో కొంత నేర్పును చూపినారు.

---

9. "తీర్థులవారు ఆంధ్రదేశమునుండి తరలివచ్చి, తంజావూరులో స్థిరపడిన ఆంధ్రబ్రాహ్మణ కుటుంబములో దక్షిణదేశమందే పుట్టె" నని ఆచార్య పి. సాంబమూర్తిగారి అభిప్రాయము.

10. "ఆంధ్ర వాగ్గేయకారచరిత్రము"—పుట 195. సిద్ధేంద్రుడు తీర్థులవారి శిష్యుడనెడివాదము మీదనే శ్రీ రజనీకాంతారావుగారు మొగ్గు చూపించారు.

సిద్దేంద్రుడు భామావిరహమునకు, భామాకృష్ణ సమాగమునకు ప్రాముఖ్య మిచ్చి చివరికథను త్రుంచివేసెనని చెప్పవచ్చును. లేదా భాగవతులా భాగమును ప్రదర్శించుటలో అశ్రద్ధ చూపుటవలన మన కది అలక్ష్యమైపోయి ఉండవలెనని భావించుచున్నాను.

ఇంతవరకును నిరూపించిన ఆ యీ విషయములను బట్టి సిద్ధేంద్రుడు క్రీ. శ. 14, 15 శతాబ్దములకు చెందిన వాడనియు, కూచిపూడి బ్రాహ్మణభాగవతులు వీరనరసింహరాయల సమక్షమున క్రీ. శ. 15 వ శతాబ్దిప్రారంభములో ప్రదర్శించిన కేళిక లేదా కీర్తన భామాకలాపమే అనియు స్పష్టమగు చున్నది.

డా. పోణంగి శ్రీరామ అప్పారావు

# ఉపోద్ఘాతము

కూచిపూడి నాట్యకళా ప్రాశస్త్యాన్ని గురించి పాఠక లోకానికి యిదివరకే తెలుసు. కూచిపూడి వారికి యీ కళను అందించిన మహానుభావుడు సిద్ధేంద్రుడు. నాట్యకళను ఒక యోగంగా అభ్యసించడం వలన సిద్ధేంద్రయోగి అన్న పేరు ఆయనకు అన్వర్థనామం అయింది. అతురసన్యాసమును స్వీకరించినందువల్ల యౌవనంలోనే ఆయనకు భార్యతో ఎడబాటు కలిగింది. ఆ దంపతుల అనన్యమైన అన్యోన్య ప్రేమను భౌతికస్థాయినుంచి ఆధ్యాత్మికోన్నత స్థాయికి భావన చేసికొని మధుర భక్తిగా ఉపాసించాడు ఆయోగి. ఆ మధుర భావాలలోని ఆయన రచనయే భామాకలాపం. శ్రీకృష్ణుని దేవేరులలో రుక్మిణీదేవిని సాక్షాన్మహాలక్ష్మి అవతారంగా భావించి ఆరాధిస్తారు ప్రజలు. సత్యభామ ముక్కోపి యనీ, ప్రౌఢయనీ శ్రీకృష్ణుని తనకు ఏకైక స్వత్వముగా చేసికొనవలెనని భర్తతో ఎడనెడ మారాముకూడ చేస్తూండేదని ప్రజలలో ప్రచారం ఉంది. పరిశీలిస్తే ఆమె ప్రేమ నిరుపమానమైంది. రుక్మిణి ఒక భక్తురాలు మాత్రమే. సత్యభామ ప్రేమస్వరూపిణి. భక్త్యావేశానికి ప్రేమ తొలిమెట్టు. ఆ ప్రేమలో స్వార్థం కూడినప్పుడు కించిత్తు మలినాన్ని శంకిస్తారు కోవిదులు. ఆ స్వార్థం తొలగినప్పుడు ఆ ప్రేమయే ఒక మహాయోగ మని భావించాలి. సిద్ధేంద్రుడు ఇతర కవులవలె గాక సత్యభామనే తన గ్రంథానికి నాయికగా ఎన్నుకొన్నాడు. ఆమెలోని అహంకారాన్ని తొలగించి దివ్యస్వరూపిణిగా చిత్రించు కొన్నాడు.

## II

ఆమె ప్రేమ భౌతికవాసనలనుతొలగించుకొని దివ్యమైంది.

"సత్యా, నీవు చక్కనిదానవా? నేను అందగాడినా?" అని ప్రశ్నించారు కృష్ణపరమాత్మ. సత్య, తాను కృష్ణసౌందర్యాన్నే నిజ సౌందర్యంగా భావించి, "నేనే చక్కనిదానను" అన్నది. ఆమె నిజంగా సౌందర్యవతే. ఆ భావనలో ఆమెకు సంపూర్ణ విశ్వాసం ఉంది. తన స్వాభిమానం వల్లనూ ఆమెకు గల అహంకారము వల్లనూ ఆ భావన మలినమైంది. ఆ అహంకారాన్నీ ఆమె దురభిమానాన్నీ తొలగించాలని పరమాత్మ సంకల్పించాడు. అవి తొలగితే ఆమె ఆయనకు మరింత సన్నిహితురాలౌతుంది అదే ఆయన ఆశయం కూడా.

భామాకలాపంలోని సత్య స్వాధీనపతిక. కలహాంతరిత. వాసకసజ్జి. సిద్ధేంద్రుడు చక్కని సన్నివేశాన్ని కల్పించాడు. చివరకు సమావేశ పరిపాటు. జీవాత్మ పరమాత్మల ఐక్యానుసంధానమే భామాకలాపం యొక్క పరమార్థం. వాసన తొలగిన జీవుడు ఆత్మస్వరూపుడౌతాడు. అనంతరం ఆ క్షణంలోనే పరమాత్మతో ఐక్యానుసంధానం సిద్ధిస్తుంది.

సిద్ధేంద్రుని భామాకలాపం లిఖితప్రతి ఎక్కడా లభ్యం కాలేదు. ఆనోట ఆనోట ఆ గ్రంథం ప్రతివారికీ సంక్రమించింది. కృష్ణాతీరంలోని శ్రీకాకుళం మొదలు వంశధారా తీరంలోని ముఖలింగం వరకు సిద్ధేంద్రులు సంచరించారనీ తానే భామయై ప్రదర్శించారనీ, అసంఖ్యాకమైన శిష్యకోటికి దానిని నేర్పించారనీ ప్రతీతి. ఈనాడు మేము వెతుకగా సుమారు నూరు ప్రతులు లభించాయి. అనేక పాఠాంతరాలున్నాయి.

ఇదిగాక అనేకమంది - భామా కలాపాన్ని రచించారు. కొందరు పారిజాతం అనే పేరుతో కూడ కొన్నిటిలో లేనివి, కొన్నిట ఉన్నవి. నరకూరు వారి పారిజాతం, మకరకంటివారి భామా కలాపం, మంగు జగన్నాధం గారి భామా కలాపం, ఇదిగాక తూర్పున వంకాయల బలరాము భుక్త, చామర్తి పాపయ్య, కాలుకంఠి వెంకటస్వామి యిత్యాదులు కొన్ని ప్రతులను రూపొందించు కొన్నారు. కూచిపూడిలో వేదాంతం పార్వ తీశం మరొక ప్రతిని రచించారు. బందరు మరంగంటి శేషా చార్యులవారి వద్ద మరియొక ప్రతి ఉన్నది. తరిగొండ వెంక మాంబగారు ఇందు కొన్ని కీర్తనలను రచించారు. అందుకు నిదర్శనంగా వేంకటేశ్వర మకుటంతో కొన్ని దొరికాయి. ఇందు ఏ కీర్తనలు సిద్ధేంద్రునివి, ఏవి కావు అని ప్రశ్న. ప్రాత ప్రతులన్నీ గాలించాము. మకుటంలేని కీర్తనలు మకుటం ఉన్న కీర్తనలూ విడదీశాము. కూచిపూడి సంప్రదాయులలో కళా భిజ్ఞులైన వేదాంతం సాంబయ్య, భాగవతుల రామయ్య, వెంపటి వెంకటనారాయణ, చింతా వెంకట్రామయ్య గార్ల ప్రతులను సేకరించాం. నేను, శ్రీ మహాకాళి లక్ష్మీనరసింహం, శ్రీ వేదాంతం ప్రహ్లాదశర్మ కలసి ఒక నిర్ణయానికి వచ్చాము. ఫలితమే యీ ప్రతి. ఇందులో సుమారు పది కీర్తనలు యితర మకుటా లున్నాయి. మకుటాలు లేని కీర్తనలన్నీ సిద్ధేంద్రుని రచనలుగా భావించండి. కొన్ని సన్నివేశాలకు అను గుణంగా మకుటం లేని కీర్తనలు లభించనందున మకుటములున్న కీర్తనలను స్వీకరించాము. అయితే వీరందరూ కూడా అధి

పురుషుడైన సిద్ధేంద్రుని పరోక్షశిష్యులుగా అంగీకరించి యున్నందువల్ల వీరందరి కృతులూ సిద్ధేంద్రునికే అంకితమైనవని భావిద్దాం. బమ్మెర పోతన్నగారి పేరున గల భాగవత మహా గ్రంథంలో కూడా స్వల్పంగా యితరుల రచన లున్నాయిగా? అలాగే యీ గ్రంథాన్ని సిద్ధేంద్రకృత భామా కలాపం అందాము.

పాతిక ముప్పదేండ్ల క్రితంకూడా వెంపటి వెంకట నారాయణగారు భామా కలాపాన్ని మూడు రాత్రులు ప్రదర్శించేవారట. మొదటి రాత్రి అంతా సత్యభామ తెరమరుగునే వుండేదట. ఇప్పుడు అంతటి సుదీర్ఘ ప్రదర్శనమును దర్శించగల ఓపికకూడా లేదు. ఇప్పుడు యీ గ్రంథాన్ని సంక్షిప్తపరచుకొని రెండుగంటల వ్యవధిలోనే ప్రదర్శించడం పరిపాటి అయిపోయింది. ఎలా సంక్షిప్త పరచుకోవాలో తరువాత సూచించాము.

ఈ మా కృషిని ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ ప్రోత్సహించింది. వారికి మా ధన్యవాదాలు.

భామాకలాప ప్రదర్శనంలో సిద్ధహస్తులైన స్వర్గీయ వెంపటి వెంకటనారాయణ శాస్త్రి గారికి ఆంధ్ర నాట్య కళాభిజ్ఞు లెల్లర కృతజ్ఞతా సూచకంగా యిది వారు పెట్టిన భిక్షగా భావించి వారి ఏకలవ్య శిష్యు లందరూ యీ గ్రంథాన్ని అంకితం చేసుకొంటున్నారు అని భావించండి.

బందా కనకలింగేశ్వరరావు

# ప్రదర్శనకు సూచనలు

కూచిపూడి ప్రదర్శనం అనే ప్రతి ప్రదర్శనానికి పూర్వరంగం ఉండితీరాలి.

సంక్షిప్త ప్రదర్శనంలో నాందీస్తుతి, అంబాస్తుతి ఉంటే చాలు.

సంక్షిప్త ప్రదర్శనానికి కావలసిన కీర్తనలు సంభాషణలు 1, 2, 3, వరుస క్రమంలో ఇచ్చాము. అవి అనుసరిస్తేచాలు.

ప్రతి కీర్తన పూర్తిగా పాడనక్కరలేదు. కొన్ని చరణాలు వదలి వేయవచ్చు.

కీర్తనలు, గద్య, నర్తకీమణులు గాత్రంతో అనితీరాలి. ప్రక్కనున్న సహాకార గానం వారు అందుకుని పూర్తిగా వంత పాడాలి.

గద్యకు పద్యాలకు శ్లోకాలకు అభినయం చెయ్యాలి.

కీర్తనలకు దరువులకు నాట్యం చెయ్యాలి. భావ ప్రస్ఫుటనం కోసం అభినయంచేస్తూ ముద్రలు చూపించాలి.

# భావాకలాపము

## గురుప్రార్థన

గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః
గురుదేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్ పరబ్రహ్మ
తస్మై శ్రీ గురవేనమః

## స్వస్తి

హరిః ఓమ్
సహనావవతు సహనౌభునక్తు
సహవీర్యంకరవావహై
తేజస్వినా వధీతమస్తు మా విద్విషావహై
ఓం శాన్తి శ్శాన్తిః
శం నోమిత్ర శ్శం వరుణః
శంనో భవత్వర్యమా
శంన ఇంద్రో బృహస్పతిః
శంనోవిష్ణు రురుక్రమః
నమోబ్రహ్మణే నమస్తే వాయో
త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాఽసి
త్వమేవప్రత్యక్షం బ్రహ్మావదిష్యామి
ఋతం వదిష్యామి సత్యం వదిష్యామి

తన్మా మవతు తద్వక్తార మవతు
అవతుమాం అవతువక్తారమ్
ఓం శాన్తి శ్శాన్తి శ్శాంతిః

## నాంది

ఈ క్రింది శ్లోకములను సూత్రధారుడు పఠించ వలయును. వాని కిరువైపుల నున్న పారి పార్శ్వకులు శ్లోకాంతమున ఏవ మస్తు అని పలుకుచు అంజలి హస్తమును శిరమునందుంచి కొని నమస్కరించ వలయును. రాక్షసులు చేయు విఘ్నములనుండి రక్షించుటకు నాట్య మండపమున గల దేవతల నానందింప జేయు టకు యీ నాందీ స్తోత్రము భరతముని చేత ప్రదర్శింపబడినది.

సూత్ర : నమోస్తు సర్వదేవేభ్యో
ద్విజాతిభ్య శ్శుభం తథా
జితం సోమేన వై రాజ్ఞా
శివం గోబ్రాహ్మణాయచ...

పారిపా : ఏవమస్తు...

జతి : కిటతక తద్ధిం కిటతక తద్ధిం
కిటతకతాంగిట తకఝుణ తద్ధిం
కిటతక తద్ధిం కిటతక తద్ధిం
కిటతకతాంగిట తకఝుణ తద్ధిం
దినతాంగిటతక తాంకిటఝుణుతాం
తాంకిటఝుణుతై తాంకిటఝుణు
తత్తై ధణతఝుణు తాతధణత ఝుణు
తధణతఝుణు

తధణరుణారుణు తధణారుణు
తకదికు తక తకదికు తదిగిణతోం...

సూత్ర : బ్రహ్మోత్తరం తథైవాఽస్తు
హత్వాబ్రహ్మద్విష స్తథా
ప్రశాంస్తిస్సహాం మహారాజః
పృథివీంచ స సాగరామ్...

పారిపా : ఏవమస్తు...
కిటతక ధీం ధీం తద్దించ తద్దింద తద్దింత
కిటతక ధీం ధీం తద్దించ తద్దించ తద్దింత
కిటతక ధీం ధీం తద్దింద
కిటతక ధీం ధీం తద్దింద
ధీం తతక ఝుణు తాం
ధీం తతక ఝుణు తై
ధీం తతక ఝుణుతాం...తై...

సూత్ర : రాష్ట్రం ప్రవర్ధతాంచైవ
రంగస్యాశాసమృద్ధ్యతు
ప్రేక్షకస్తుస్మహా
ధర్మే భవతు బ్రహ్మభావితః

పారిపా : ఏవమస్తు ...

జతి : కిటతక తద్ధిం......కిటతక తద్ధిం

సూత్ర : కావ్యకర్తుర్యశశ్చాஉస్తు
ధర్మశ్చాపి ప్రవర్ధతాం
ఇజ్యయా చాఽయానిత్యం
ప్రీయతాం దేవతాముదా...

పారిపా : ఏవమస్తు...

జతి : కిటతక ధీం......కిటతక ధీం

## పూ ర్వ రం గ ము

పుణ్యాహవాచనము : మృణ్మయపాత్రలోని జలమును మామిడి ఆకులతో జల్లపలెను.

తత్తై ధణతఝణు తాతధణతఝణు
తధణత ఝణు
తధణ దణాఝణు తధణాఝణు
తకదికతక తకదికు దదిగిణతోం

తీర్మానం : త ళం గు తోం త క ద ది గి ణ తోం
త ళం గు తోం త క ద ది గి ణ తోం
త ళం గు తోం
త ళం గు తోం
త క ధి కు త క ద ది గి ణ తోం
త క ధి కు త క ద ది గి ణ తై
త క ధి కు త క ద ది గి ణ తోం...

త తై....

## ఇంద్రధ్వజ ప్రతిష్ఠాపనము

**తీర్మానం :** ధిత్తా ధిమితా కిటతక
తళంగుతకధిమి తకదదిగిణతోం
ధిత్తా ధిమితా కిటతక
తళంగుతకధిమి తకదదిగిణతోం
ధిత్తా ధిమితా ధిమితా కిటతక
ధిత్తా ధిమితా ధిమితా కిటతక
తకధికి ఝుణు దధిగిణతోం....తత్తై

ఇంద్రధ్వజపు వెదురుకఱ్ఱ నాలుగు కణుపులతో 108 అంగుళముల పొడవుండవలెను. ధ్వజము పై భాగమును త్రికోణాకారము గలిగి మూడు మూలలను ఐరావతము కల్పవృక్షము కామధేనువు చిహ్నములు గలిగి మధ్య యీ నెలవంకబోలు వజ్రాయుధము నుండవలెను.

## ధూపము

**తీర్మానం :** తధణా తఝుణు తధిమి తకిట
తళంగు తకధికు తకదదిగిణతోం
తధణా తఝుణు తధిమి తకిట
తళంగు తకధికు తకదదిగిణతోం
తధణా తఝుణు తధిమి తకిట
తక ధికు ఝుణు తక దదిగిణతోం....తత్తై

## దీపము

**తీర్మానం :** తకతోం ధికతోం దిగిదిగితకతోం
త త్తళంగుధిత్తా తధిత్తై

తకతోం ధికతోం డిగిడిగితకతోం
త త్తళంగుధిత్తా ధిత్తై
తకతోం ధికతోం డిగిడిగి తకతోం
తకతోం ధికతోం డిగిడిగి తకతోం....
దాద్దాం దిందా దాదాదా డీం దా
తోంగుహక్కు డిగిటక్కు తోంగుహక్కు
దడగిణతోం... తత్తై

పుష్పాంజలి

తీర్మానం :: తోంగా తోంతోంగ తాంతోంగత్తా
ధిక్కుతక్కు దాద్దో దోహద్దాద్దిం
డిధీం తెవాద త్తత్తాం
తోంగా తోంతోంగ తా. తోంగత్తా
ధిక్కుతక్కు నాద్దో దోహద్దాద్దిం
డధీం తెవాద త్తత్తాం
ఝాకిటఝుం తతకిటఝుం
తధి త్తధి త్తధి డడిగిణతోం
ఝాకిటఝుం తతకిటఝుం
డధి త్తధి త్తధి డడిగిణతోం
ఝాకటఝుం తతకిటఝుం
డధి త్తధి త్తధి దడగిణతోం....తత్తై

గణపతి స్తవము : అగజానన పద్మార్కం
గజానన మహర్నిశం

అనేకదంతం భక్తానా
మేకదంత ముపాస్మహే...
తత్తై ధణతఝణు.... ........దదిగిణతోం

జతి : తాద్ధిగి దిగిత్తై తి త్తిత్తై తిత్తై
ట త్తధి పత్తిత్తాహం
దత్తాసుటకిట కిణలాం తొంగ
తా దగిగిణట దగిగిణత దదిగిణత....

పల్లవి : తాండవ నృత్యకరీ గజానన

అనుపల్లవి : ధిమికిట ధిమికిట తాళమృదంగ
బ్రహ్మతాళధరీ గజాననా...తాం
తేజస త్కోటీ సురగణ ఘాటీ
వందే శివగౌరి గజానన...తాం....
తత్తై ధణతఝణు...... దదిగిణతోం

మిశ్రగతి : దొద్దో దీంద దొదొదో డింద........

అంబా స్తవము

చతురశ్రగతి: అంబా పరాకు దేవీ పరాకు
మమ్మేలు మా శారదాంబా పరాకు
వాణీ పరాకు, గీర్వాణీ పరాకు
వాణీ చక్కావి నీలవేణీ పరాకు
ఓంకారీ కౌమారీ వారాహీ శర్వాణి శాంకరివా
లోకశక్తీ పరాకు

ఈ రీతిగా మిమ్ము గోరినవారిని గావవే
కనక దుర్గాంబా పరాకు
సరసిజలోచను చెల్లెలివై మమ్ము గరుణించు
బంగారు తరుణీ పరాకు

మిశ్రగతి : ఆరువీధుల నడుమ అగమైన బం
గారు మేడలో వెలసిన బాలా పరాకు ॥అంబా॥
మూడు మూర్తులకు మూలమైన కూచి
పూడిలో వెలయు పూబోడీ పరాకు ॥అంబా॥
కనకాబ్రమ జలధిలో జలకమ లాడుచు
గులుకుచు దిరిగేటి కలికీ పరాకు ॥అంబా॥

త్రిశ్రగతి : తకిటతాం తాంతా తెయ్యనుచు
తాండవ మాడేటి తరుణీ పరాకు ॥అంబా॥

చతురశ్రగతి: ఈ రీతిగా మిమ్ము.... ఓ జననీ
ఒంబా దుర్గాంబా తల్లీ....

దరువు – పూరికల్యాణి – ఆది – చతురశ్రత్రిపుట

పల్లవి : రాజగోపాలం రాధాలోలం
రాజగోపాలం భజే
మమ జీవనం రాధాలోలం భజే
మమ జీవనం రాధాలోలం భజే
అఖిలాండకోటి బ్రహ్మాండనాయకం
రాజగోపాలం భజే మమ

శృంగార రూపకం
మంగళ ప్రదాయకం ॥రాజ॥
సిద్ధేంద్రపూజితం శ్రీసతీకామితం ॥రాజ॥

దరువు - ఆటతాళ - ఆది

రామ రాఘవ రాజీవలోచన
కామితఫలదా కరవరదా ॥రామ॥
నీవేల వచ్చేవు నీవేల పోయేవు
రమ్మనవే వాని రమ్మనవే
చెలియా నీవైనపోయి
చెన్నకృష్ణుని దోడితేవె
రమ్మనవే రమ్మనవె వాని
వేగ రమ్మనవె
తోత్తొ దిగిదిగితా ధాం దదిగిణతోం
ధాందదిగిణ తై ధై దదిగిణతోం

దరువు - సౌరాష్ట్ర - త్రిపుట

అంభోజాసనురాణి హరిరాణి
గొలిచేటి అంబా ఓ భ్రమరాంబా
వెలయు నష్టాదశ వేదపీఠాధిరాణి ॥అంబా॥
చెలగుచు నపకోటి సిద్ధులు సేవించు ॥అంబా॥
తుంబురు నారదాదులు హెచ్చిపాడేటి ॥అంబా॥
స్థిరముగ మము నేలు శ్రీగిరి
భ్రమరాంబ ॥అంబా॥

శ్రీగిరి నిలయుడౌ శివుని పట్టపురాణి ॥అంబా॥

సూత్ర : ఇట్లు వేదోక్త నాందీస్తోత్ర పూర్వరంగపూజాదిక సకలదేవతా ప్రార్థనానంతరంబున అభ్యుదయ పరంపరాభివృద్ధిగ మాత్రవదర్శింపం బూనిన సిద్దేంద్రయోగికృత భామాకలాపం బను శ్రీకృష్ణ చిద్విలాసంబునకు గథాప్రమం బెట్టి దనిన

కందం : నయులార సిద్ధయోగీ
శ్వర కృత భామాకలాప సత్కృతి, భావ
స్ఫుర రాగ లయ రసోచిత
సరణి ప్రదర్శింతు మిపుడు సరసులు మెచ్చన్.

పూర్వరంగం సమాప్తము

---

సత్యభామ ప్రవేశము

సత్య :

దరువు - సౌరాష్ట్ర - జంపెతాళం

తాపమార్చుకోనైతి దయగ మాటలాడనైతి
చెప్పినట్లు సేవ జేసి చరణములు నొత్తనైతి
మోసపోతి నమ్మలార మొదటనే నేరనైతి
ముందుగతి గాననైతి, ముంచె కౌగిలించనైతి
కొంగుపట్టి వాని వలపు గ్రుమ్మరించుకోనైతి
॥మోస॥

అక్కినపుడె తిరువేంకటేశు డెలమి కౌగిటలో
గుబ్బలు వాని చేతికిచ్చి యుబ్బుచు
సూడకుండనైతి ॥మోస॥

2 ఉ. రావే మాధవి రావె కుందరదనా
రావే సరోజాననా
రావే సల్లలిత ప్రసంగచతురా
రావమ్మ ప్రాణేశ్వరుం
డే వెంటం జనె? నెందు దా
నిలిచెనో? ఏనాతి లాలించెనో
నీ వెంబడైనను వానిజూచితిగదే
నీరేజ పత్రేక్షణా

3 రావే మాధవీ, రావే పూబోడి, రావే చకోరాక్షి, రావే
హంసగమనా, ఓయమ్మ నా ప్రాణపదంబైన, నాస్వామి
పొన్నలయం దున్నాడో పొగడల యందున్నాడో, కేళికా
గృహములం దున్నాడో, మరి యెందున్నాడో కొనివచ్చి
నాకు చూపలేవుగదమ్మా

మా: కం. లీలామానుష విగ్రహు
లోలాక్షిరో పెండ్లియాడి లోకేశ్వరివై
బేలతనంబున జింతిల
నేలా వివరంబుగాను నెలతరో చెపుమా

సఖీ ! శ్రీకృష్ణ స్వామివారి దేపేరెవయ్యు పతి విరహానల దందహ్యమానస పైనట్లు దోచుచున్నది. నీ వెవ్వతెవు - పేరేమి - వివరింపుము.

సత్య : ద్వి. జలజాక్షి వినవె నా జన్మ కథనంబు
కలడు సత్రాజిత్తు ఘనుడు మా తండ్రి
కమలాప్తు నర్చించి కాంతి శమంత
క మణి నారివిపేరి గాన్కగా బడసి
కొనివచ్చి పూజింప గోవిందు వెలమి
తన కిమ్మటంచు నద్దాని గోరంగ
మాతండ్రి లుబ్ధుడై మణి నీయకుండె
నాతని సోదరుం డా మణి దాల్చి
తురగంబుపై నెక్కి దూరాటవులకు
నరిగిన నొకసింగ మతని వధించి
మణి గొనిపోవ నా మార్గంబు గాంచి
ఘన జాంబవంతుండు ఖండించి మించి
ధీరత నా మణి దీసుకపోయి
తోరంపు తనకూతు తొట్టెకు గట్టె
నంత సత్రాజిత్తు డాత్మ సోదరుడు
నెంతకు రాకున్న నెలమి జింతించి
శ్రీకృష్ణుడీ మాయ జేసె నసూయ
గాకున్న నొరులచే గాదని పలుక

నానింద బాపుకో నా కృష్ణు డెంచి
జా నొప్పఁగా సర్వ సన్నద్ధు డగుచు
జాడ జాడల బోయి జాంబవ ద్బలుని
నోడించి మించిన నుబ్బుచు నపుడు
మణితెచ్చి ముదముతో మా తండ్రికీయ
ప్రణతుడై మాతండ్రి పంకజాక్షునకు
నా మణి నిచ్చి స్వీయాపరాధంబు
తా మదినెంచి పశ్చాత్తాపమానసుడై
ననుగూడ నర్పించె నారాయణునకు
శ్రీమంతు భార్యనై పెంపొందుచుంటి
భామామణీ సత్యభామ నా పేరు

వరుస – ఆనందభైరవి – చాపుతాళం

సత్య : భామనే సత్యభామనే వయ్యారి సత్య ||భామ||
భామనే పదియారువేల
కోమలులందరిలోన
రామనో గోపాలమూర్తికి
ప్రేమపాత్రినైన సత్య ||భామ||
అట్టహాసముచేసి సురల
నట్టెగెలిచి పారిజాతపు
చెట్టు తెచ్చి నాదుపెరట బెట్టి
పే నాటించుకొన్న సత్య ||భామ||
కూరిమి సత్రాజిత్తు
కూతురినై ఇందరిలోన

జాలిమాలి మగనిబాసి
తాళజాలని మగువ సత్య ॥భామ॥
వారిజాక్షి ద్వారకాపుర వాసుని కౌగిటిలోన
కూరిమి బెనగొని రతుల గూడిన
యొయ్యారి సత్య ॥భామ॥

కం. వినవమ్మ ఏమి దెలుపుదు
ఘనుడగు నానాథు బాసి కానకయుటకుం
బనిబూని వెదక వచ్చితి
ననుపొందగ సత్యభామ యందురు నన్నున్

4. మాధవి: నీ నాధుని పేరేమి, రూపురేఖా విలాసము
లెట్టివి - వివరించి చెప్పుము తరుణీ

సత్య: గీ. స్వీయప్రాణేశు నామంబు చెప్పుమంచు
నతిప ఇల్లాండ్రలోన నన్నడుగ దగునె
దయితు నామంబు దెలుపంగ దగదుగాన
గురుతులం గొన్ని దెల్పెద నెరుగుమమ్మ

సీసం. భావింప దేవకీ దేవి మా యత్తమ్మ
మా మామ వసుదేవ మాన్యుడమ్మ
బలభద్రమూర్తి నా బావగా రగునమ్మ
కొమ్మ రేవతి తోడి కోడలమ్మ
సకియ రుక్మిణి నాకు సవతికావలెనమ్మ
ఘన పంచశరుడు నా తనయుడమ్మ
మగువరో సాత్యకి మఱది గావలెనమ్మ
ఆడు బిడ్డగునమ్మ అల సుభద్ర

ఇంద రున్నారే, ఉన్నందు కేమి ఫలము
కలిమి బలిమియు సకల భాగ్యంబులున్న
ప్రాణనాథుని పొం దెడబాసియున్న
యింతులకు నెంత గల్గిన నేమిఫలము ?

దరువు. శ్రీ జయంతుడైన సత్రాజిత్తు
ముద్దుకూతురనే యమ్మలారా
రాజాధిరాజైన బలరాముని
మరదలనమ్మ కొమ్మలార
ఈరేడు జగములనెందు
గానరుగదే అమ్మలార
సాజ భోజములు మెచ్చ
సత్యయందురే నన్ను కొమ్మలారా
శ్రీ స్వామివారి రూపురేఖావిలాసములు
చెప్పెద వినవే సఖీ....

సీసం లలితరేఖాత్రియ కలితకంధమువాడు
ధవళ విశాల నేత్రములవాడు
ఆజానులంబి బాహోయుగంబులవాడు
కమనీయ నీలాలకములవాడు
హారనూపుర విశాలోరస్థలమువాడు
తరుణార్క సదృశ పాదములవాడు
మహనీయ నీల కోమల శరీరమువాడు
నవదర స్మిత సుఖాననము వాడు

సరససల్లాప గుణవిశేషములవాడు
మదన శతకోటి సౌందర్య మహిమవాడు
దేవకీనందనుడు కృష్ణదేవు డితడు
వలచి కనుగొంటి నేత్రోత్సవంబుగాను.

చం. మదగజవైరివంటి నడుమా
కమలంబువంటి కన్నులా
అదిరి శశాంకబింబోలు ముఖమా
ముకురంబువంటి చెక్కులా
మదనుని గన్న చక్కదనమా
మధురాధరి వానిరూపు నా
హృదయపటంబునందు
లిఖియించిన కైవడి గానవచ్చెడినే

దరువు. ఉండుండి ప్రాణేశునందు దలచుకొంటే
గుండె దిగులు మానునే ఓయమ్మా
గుండె దిగులు మానునే
నీతియెంచక నల్ల నాతినిగూడితే
యేతీరున వేగింతునే ఓయమ్మా
ఏ తీరున వేగింతునే
వాడుక జెక్కిలి ముద్దుబెట్టగ బోతే
నిద్దంపు మోవి యానునే ఓయమ్మా
నిద్దంపు మోవియానునే
వడుపడి చేరుగక నా ప్రాణనాథుడు
పడతిని గూడియుండునే ఓయమ్మా
పడతిని గూడియుండునే

మాధవి. నీనాధుని పేరు వివరముగా జెప్పవమ్మా

సత్య. ప. నే జెప్పలేనే ఓయమ్మా అక్కా ॥నే॥
నే జెప్పలేనే ఓ రాజీవదళనేత్రి ॥నే॥
కల్లగాదు లోకమెల్ల వినగ నే జెల్ల
పల్లవాధరి మగనిపేరు రంగని పేరు ॥నే॥
నే జెప్పలేనమ్మ ఓ చంద్రవదనరో
యూచక్రమేలేటి యాచక్రధరు పేరు ॥నే॥
చందురు గేరు మోమందముగలవాని
మందహాసముగల కందర్పజనకుని ॥నే॥
అక్షీణ కరుణాకటాక్షముచే లోక
రక్షకుడై మించు పక్షివాహను పేరు ॥నే॥
చెప్పలేనె మది నెప్పుడు బాయక
నొప్పుగ నస్నేలు చున్న సామిపేరు ॥నే॥
వేడుకతో ముచ్చలాడ మనసైన
చేడియరో యింద రాడువారిలోన ॥నే॥
వాసిగ ద్వారకావాసుడై విలసిల్లు
వసుదేవ సుతుడగువారిజాక్షుని పేరు ॥నే॥

సఖీ మాధవీ కొన్నిగురుతులు దెలిపెదను వినవే

కం. విక్రమ మెసగగ క్షోణీ
చక్రము రక్షించుకొఱకు సమరమునందున్
శక్రారుల దునుమాడిన
చక్రధరుండంద్రుడువాని సామజయానా

5 చక్రము ధరించినవాడమ్మా సఖీ

6 మా : చక్రము ధరించినవాడు కుమ్మరి వారి చిన్న వాడ గాదటమ్మా ?

7 సత్య : నా నాథుడు శంఖాలు ఊదువేమే - శంఖము ధరించినవాడే.

8 మా : శంఖము ధరించెడు జంగమదేవరా నీ పతి ? సుదతీ.

9 సత్య : కాదే-నెమలిపింఛము ధరించు కమలాక్షు నెరుగవటే ?

10 మా : నెమలిపింఛము ధరించువాడు చెంచువారి చిన్న వాడుగాదా సఖీ ?

11 సత్య : అబ్బ - పోనీ మకరకుండలములు ధరించిన వాని నెరుగుదువా ?

12 మా : సరిసరి - తెలిసినది - యజ్ఞములు చేసిన బ్రాహ్మణ యువకుడా నీ భర్త ?

13 సత్య : అబ్బ - ఇంక నేను జెప్పలేను గదే - ఇంతటి వగ వారిలో యీతోటియాడు వారిలో సత్యభామా పుగని పేరు చెప్పినదన్న సిగ్గుగాదటే ఓయమ్మ ?

దరువు - శ్రీరాగం - ఆదితాళం

సిగ్గయ్యేనే ఓయమ్మ పేరూ చెప్పా ।సిగ్గ।
సిగ్గయ్యేనోయమ్మ చిన్ననాట నుండి
వానిపేరు చెప్ప వాడుక లేదమ్మా ।సిగ్గ।

14 వసుదేవ తనయుడై వసుధ జన్మించిన
పసుల గాచెడు గొల్ల బాలునిపేరు చెప్ప ॥సిగ్గ॥
చక్కెర మోవి చురుక్కున నొక్కుచు నా
మక్కువ దీర్చిన మగనిపేరు చెప్ప ॥సిగ్గ॥

మా : నీ నాధుని పేరు చెప్పక నా కెట్లు తెలియు నమ్మా చెలీ

సత్య : ద. వాని పేరు చెప్పలేనే, ఓవనితా
గురుతులు వివరించెదనే
పూని త్రికూటగిరిలోన వెలసినట్టి శేషశయనునిగా
ప్రాణసఖుడైన చక్కనివాని పేరు చెప్పలేనే

శ్యామలవర్ణము వాడే - తెల్లతామర కన్నులవాడే, బల
రాముని కనుజుడై సోముని గెల్చు నెమ్మోమువాడే
మామ మారుని మెరయువాడే, వానిపేరు
పిల్లనగ్రోవి నూదువాడే, బంగరు పూల పిల్లన
గ్రోవినూదువాడే
నెమలిపింఛము శిఖనమరువాడే అల్లి పాలుపెరుగుచల్ల
వెన్న నెయ్యి కొల్లలాడి గొల్లపిల్లల కిచ్చిన.,
॥వానిపేరు॥

మున్నంవు నెమ్మోము వాడే,
పసిడి దుప్పటి వల్లెవాడు వాడే
మువ్వురికి నాదిమూలమై శేషునిపై
పవ్వళించినట్టి పరమాత్ము గురుతు వివరించునే

మా : సఖీ, ఇంతవరకు నేమేమియో చెప్పెదవు కాని నీ నాధుని పేరు విశదముగ దెలుపవైతివి. తెలియక నే నెందు నెవరికొరకు వెదుకగలను చెప్పుము.

సత్య : ఇంకను తెలియలేదటే సఖీ! ఎంతటి మందగమనవే. అయితే చెప్పెదవినుము.

గీ. కాకు వక్షమువసుడిని జొక్కముగ నిల్పి
పర్షవర్ణముక్రింద ణవర్ణ మెలమి
వ్రాసి తుది స్వామి పదము చేర్పంగనాదు
ప్రాణనాధుని నామ మేర్పడునె చెలియా

ఇంకను చెప్పెదను వినవే

కం. నల్లని దేహమువాడే
తెల్లని తిరుమణిని నుదుట తీర్చినవాడే
చల్లని చూపులవాడే
గొల్లడు మనలోని చిన్ని కృష్ణుడె చెలియా!

15 మా: అమ్మా తెలిసినది, తెలిసినది. ఆ ద్వారకావాసుడు, ఆ నీలమేఘశ్యాముడు, ఆ పద్మాయతాక్షుడు, ఆ పీతాంబరధారి, ఆ జగద్రక్షకుడు, ఆ శ్రీకృష్ణస్వామివారు నీ ప్రియసఖుడా? అయితే శ్రీ స్వామివారు నిన్ను విడిచి యేల చనిరో ఎచటి కేగిరో తెలుపుము.

16 సత్య: హే సఖీ - ఒకానొక నాడు నేను ఏకాంతమున బడకటింటిలో హంసతూలికా తల్పంబునందు బవళించియుండగా స్వామివారు మా గృహంబునకు వచ్చి నన్ను నిదురలేపి

తొడపై గూర్చుండ బెట్టుకొని నాకు సమస్తాభరణంబులు ధరింప జేసి, తానుగూడ ధరించుకొని యొక నిలువుటద్దము ఎదుట నుండగా అందు మా ప్రతిబింబముల జూపి సత్య భామా, నీవే చక్కనిదానవా నేనే చక్కనివాడనా . . . అని యడిగెనే ఓయమ్మా.

17 మా: బాగు బాగు - నీలమేఘశ్యామలవర్ణుడగు తాను కుందనము వంటి మేని కాంతి ఒప్పులొలుకు వదనచంద్రిక నిన్నేమని యడిగెనమ్మా? మంచిది అందుకు నీకేమి ప్రత్యుత్తర మొసంగితివి?

18 సత్య: మేము స్త్రీలముగనుక ఆడబుద్ధి యపరబుద్ధి గనుకను అబలలమగుటచేత తెలియక నేనే చక్కనిదాన నని యంటినే సఖీ.

19 మా: అపరబుద్ధి యేమి? సరియైన సమాధానమే యొసంగితివి. తరువాత

20 సత్య: అంతట స్వామివారికి నాపై మిక్కిలికోపము వచ్చి లేచిపోయెనే సఖీ: స్వామివా రెచ్చటి కేగిరే. వారి చూపు రేఖావిలాసంబులు భావ రాగనాట్యతాళగతులచేత వర్ణించుచు వెదకుదమటనే

మా: సఖి, జరిగినదానికి జింతిలనేల? మగవారు దీర్ఘక్రోధ స్వభావులు కారు. స్వామివారే ఇప్పుడో మరుక్షణముననో నీ సన్నిధి కరుదెంచును. వారికి లేని వగపు నీకేల నమ్మా?

సత్య : సఖీ! స్త్రీజన్మ మెంత దుఃఖకరమైనదే

శ్లో. లోకే స్త్రీజన్మ దుఃఖాయ
మా భూ దిద మరేకపి
కదళీ కంటకన్యాయో
దృష్టమత్రైవ దృశ్యతే

సఖీ స్త్రీజన్మమతిమృదువైన అరటాటివంటిది. పురుష జన్మ మతికఠినమైన ముల్లు వంటిది. ముల్లు అరటాకును దాకినను, అరటాకు ముల్లును దాకినను అరటాకునకే మోసముగదా! దుఃఖభాజనమైన ఈ స్త్రీజన్మము విరోధులకు గూడ వలదు చెలీ.

మా : అదిగాదు సఖీ. పురుషుడు దాజ్యమువంటివాడు, స్త్రీ అగ్ని వంటిది అని పెద్దలు చెప్పుదురు. కాన నీవు వంత మాని యుంటివా - స్వామి వారే నీ చెంతకేతెంచును తరుణీ!

సత్య : మాధవీ! పురుషుడు లేని స్త్రీ యౌవనము వృథా గదా!

శ్లో. వృథా దుర్గేషు కుసుమం
వృథా విద్వుండితా సభా
వృథా నిశ్చంద్రికారాత్రిః
వృథా విష్కాంతయౌవనమ్.

సఖీ దుర్గములందలి పుష్పములవలె, పండితులు లేని సభవలె వెన్నెలలేని రాత్రివలె కాంతుడు లేని మనసంటి యువతుల యౌవనము వృథాగదా?

మా : నాదుడులేని దానని నన్నెత్తిపొడుచు చుంటివా అయిన నాకేల నీగోల ?

దరువు – కమాచి – ఆదితాళం

సత్య : నీ విందు రాగదే ఓ మందయాన ॥నీ॥
మందయాన యెవతో మందులిడి వాని
వింవరానీయదే ఓ మందయాన ॥నీ॥

మా . మందులేమొ మాకు లేమొ - నా కేమి తెలియను ? నన్ను పోనిమ్మా.

సత్య : నీ కెందుకే కోపము ఓ మందయాన ?

మా : అదిగో పలుమారు నన్ను మందయాన యని నీచముగా సంబోధించుచున్నావు. నీకు నేను మందకొాడి పశువుగా గన్పించుచుంటి గాబోలు.

సత్య : నిన్నేమని పిలువవలెనో కోపింపక చెప్పుముచెలి.

మా : నాబాల్యమున నాకురుల యందము చూచి నా తల్లిదండ్రులు నన్ను నీలవేణి యని పిలిచెడివారు

సత్య : నీలవేణిరో నీవిందు రావే చెలి ।నీ విందు।
నీలవేణిరో ఇటు జాలము సేయకు బాల నన్నేలు గో
పాలు దేవే గోవిందు దేవే
ఆడువారిలో నిట్లాడదగునా వేడుకతో నన్ను
వేడిన రావేమె నీల వేణిరో ।నీ విందు।

కూరిమితోడ గుచేలపురీశుని
మారుకేళికిని మరువక రమ్మనవె ।సీలవేణిరో।

దైవమా నిరతరాంతఃపురదాసదాసీజన పరిజన పరిసేవిత
నగునా కీ యలజడి నేల కల్పించితివి?

చం. తలచిన దాళరాదు మది,
తల్పకమందరాదు మోహమా
నిలవగనీదు, కన్నులకు
నిదుర రాదు, వియోగతాపమా,
యలచుచు నోర్వనీయ దిక
నాకలిగాదు భుజింప, నింరనే
వలన శమించుదాన నిను
బాసి దినంబులు ప్రాణవల్లభా

దరువు - త్రిశ్రజాతి త్రిపుట

తలచిన తలపు చింతలనొందజేసితి విల
సాటివారిలో దైవమా దాని
తలపున గల కోర్కెలు పంటదిరె నే దిల
సాటివారిలో దైవమా
మంచి బుద్ధిని వెందమావులు కాశించిన
చందమాయెను హా దైవమా, దాని
మందును జెంది నే డిందురాద యేమనందు
వాని హా దైవమా
కలనైన నీ చిలుకల రవముల కాకలు వొందు
చెరుగను దైవమా వాని

గలసి సుఖించుట కలలో జూచిన వేడ్కల
        చందమాయెనో దైవమా
కాముని బలములు గ్రమ్మక వచ్చెను నేనేమి
        సేతు హా దైవమా ఎన్ని
నోములు నోచిన వానిచేత నిట్లు బాముల
        పడనాయె దైవమా
బెదరించుకొనియేటి మదవతులకు నే నొదిగి
        యుండనాయె దైవమా
ఇందు వదన యుసురునొందింప దగదని
        మందలించువారులేరె
ఒక్కొక్కయని పిలిచి యలరించు నీ చిలుక
        ఎక్కడికేగెనో దైవమా
చక్కని నాముద్దు జక్కవకే యింతి, దిక్క
        య్యెనో దైవమా

దరువు

అలివేణి కృష్ణుడా యెలనాగల వలల దగి
                                        లిందు రాడాయెనే
ప్రాణేశుడు తగి లింప రాడాయెనే -
                                        ఏనాడైన
వేగమే తావచ్చి వెలదీ రమ్మనిపిలిచి అలమి
                                    యకౌగిట చేర్చునే
ప్రాణేశ్వరుడు [illegible] కౌగిట చేర్చునే

తీరైన కస్తూరి తిలకము నుదుటిపై కొన
గోరున దిద్దునే
ప్రాణేశుడు కొనగోరున దిద్దునే
తడవాయె నినుగూడి తాళనే ఓయమ్మంటే
మాటల బ్రొద్దుపుచ్చునే
ప్రాణేశుడు మాటల బ్రొద్దుపుచ్చునే
పొద్దోయి తా వచ్చి పడకటింటిలో పాన్పుపై
పవళించునే
ఓ యమ్మా పాన్పుపై బవళించునే
ముదముతో ద్వారాకాపురి కేగినాడేమొ పతిని
దోడుకరాగదే
ఓ యమ్మా పతికి దోడుక రాగదే

దరువు — మోహా — ఆది

నేనేమి సేతునే ఓ లలనా నే నేమి సేతునే
ఈ వలపుల సాగర మీద వశముగాదే
ఓయమ్మ
మందుల మహిమయో మరు మాయయో
నా మాటంటే కూడ దటే .. ఓ యమ్మా
వెంటదిరిగి వా డాడినమాటలు విన్నప్పటి
నుండి ఓయమ్మ
యొంటికి కర్పూర గంధ ముడుకై కంటికి
వెగటాయె నోయమ్మ.

వాటమైన మగవాడు గల్గుట వ్రాతఫలము
గాదె ఓయమ్మ
ఆడుది వలచిన వలపులు భూమిలో హాయి
లేదుగా దే ఓయమ్మ
ముసుగు పెట్టుకొని అట్టె చూడగవాడు వాట
ముగ నెదుట నిలిచి మాటలాడెనే,.
ఏమ నందునే సామిని
నే మనుకొందునే, వాడు
గమికాడై నవాడు గండుమీరెనే - ఓయమ్మ
ఎన్నెన్ని తలచుకొందునే
ఏలాగు మరపు వచ్చునే....ఓయమ్మ
కసిగాటు మోవితో గలకంఠి కాలితో
పసుపంటిన దుప్పటి వల్లెవాటుతో
పొసగని నిద్రతో వచ్చి నా తలకిట
నిలిచియుండగా పొమ్మంటినే....ఓయమ్మ
చెక్కుటద్దపు పచ్చిగోరు చెంప జవ్వాజి
మక్కువ దాని కంఠమాలతో
వెక్కసముగ దాని చిటికెన వ్రేలి యుంగరము
పెట్టికొన్న జూచి పొమ్మంటినే...ఓయమ్మ

దరువు

తాళగలేనే తరుణీ నేను....తాళగ॥
తాళగ లేనే ఓ తరుణీ విభు నీ
వేళ తేకయున్న జాలము సేయక ॥తాళగ॥

సరసు డితర సారసాక్షులతో గూడి
సురతిని నన్నేలక యున్నాడు ।తాళగ।

ఎన్ని సౌభాగ్యము లున్నను నాధుడు లేని నా జీవితము వ్యర్థము.గదా చెలీ. సఖీ! ఆ సుకుమార గాత్రు డెందున్నాడని వెదకు దమమ్మా. మరతు మన్నను మరపురాడుగదమ్మా.

ఉ. ఎంత విలాస మెంత సొగ సెంత
వదాన్యత ఎంత రాజసం
బెంత యొయ్యార మెంత కళ యెంత
గభీరత యెంత యారజం
బెంత వినోద మెంత నయ మెంత
మనోజ్ఞత యెంత వింత నా
యంతటి మందభాగ్యవతి
కంతటి చక్కని దేవు డబ్బునో.

చరువు - ముఖారి - త్రిపుట

23. ఎందుబోతివి? ఎందుబోతివి? రార నంద
పూర్ణేందు వదనా ప్రజలోకానందన!
గోవిందా.... ।ఎందు।

అందెల చప్పుడు సుంతైన వినరాదు,
ముందు దోచదు నీతో ముచ్చటాడ దీరదు ।ఎందు।
కందువతో నీ మీది కాంక్షయైనా దీరదు
అందముగా నిన్ను జూడక అపుడుప్రొద్దుపోదు
వేణునాదము నేడు నా వీనుల వినరాదుగా

ప్రాణనాయక నీతోటి పదవి చేకూరదు
ప్రాణముతోడుత నన్ను గావక తీరదు
నాణెముగ నిను పొందక నా మనసు నిల్వదు,

రాధికాలోలుడా ఇటకు రావోయి ఈ వేళను
మాధవా నీ మీద నాకు మక్కువ విడజాలను
వేధ లుడిపి నన్ను గావుము వేణులోలా అబలను
శ్రీధరేశా నా మనోహర ఘోరమ్మొ వేళను

।ఎందుబోతివి।

మాధవీ। నా నాధు డెంత చక్కనివాడే

శ్లో. మౌళౌ మాయూరబర్హం
మృగమదతిలకం చారులాలాటపట్టే,
కర్ణద్వంద్వేచ తాళీదళ మతిమృదులం
మౌక్తికం నాసికాయాం
హారో మందారమాలా పరిమళభరితే
కౌంస్తుభస్యోపకంఠే
పాణౌ వేణుశ్చ యస్య వ్రజయువతియుతః
పాతు పీతాంబరోనః

సఖి। శిరమున నెమిలిపింఛము, ఫాలభాగమున గస్తూరీ తిలకము, కర్ణములందు మృదువగు తాళీదళమున్ను, నాసిక యందు ముత్యము, కంఠసీమ యందు కౌంస్తుభమణియు, గళమున మందారమాలయు పాణియందు వేణువును గలిగి వ్రజసుందరీమణులతో గూడి వెలుగొందు పీతాంబరధారిని

మరతునన్న మరపురాదే - ఓయమ్మా - ఆ మదన మోహనాకారుడు ఆ మందరగిరిధరుడు భామా, రమ్మన డాయెనే - నేనుకూడా బోయి సత్యభామ నన్నా విన డాయెనే.,

దరువు - ఆనంద - ఆది - ఝంపట

24. మదనమోహనాకారుడే ఓయమ్మలారా
మదనా మదనా మదనా యనుచును
వదలలేక వాని వలలో జిక్కితి
నే తాళలేనే ఓయమ్మలారా
అదిగో చంద్రుం డుదయం బాయెను
వలపు నిలుప నా వశము గాకున్నది
నిదురలేక వాని కెదుర చూచితే ఓయమ్మలారా
అరుగు దిగిన సమయంబును తనుగొని
యెద మూ డడుగులు యెదుర నడుతునోయమ్మా
తన్వి యెడ దృష్టితాకునో యని
సొగసుకన్నులవాని జూడ వెరతునో
వాడేల రాడే ? ఇందరిలోను ఈ సొమ్ములేలనే
నా నాధు డేడే స్త్రీ జన్మ మేలనే ఓయమ్మలారా॥

దరువు - శ్రీరాగం - హిందోల - ఆది

25. రంగుగ నామెడ మంగళసూత్రము
పొంగుచుగట్టిన సంగతి మరచెనో -
నే తాళలేనే ఓయమ్మా

ఆట ప్రాయమున దేటగు కన్నుల
కాటుక దిద్దిన కూటమి మరచెనో నే తాళ లేనే
శయ్యకు రమ్మని పయ్యెదలో చెయ్యి
వెయ్యవచ్చిన సయ్యాట మరచెనో ॥నేతాళ॥
అద నిది గద పద సదమదముగా జేయుద మని
కొదమ తుమ్మెదలు రొదలొసగె ॥నేతాళ॥
ఈ జన్మమేలనే ఓయమ్మ నే తాళ నేతాళ
నే తాళ...ఓయమ్మ॥

కందార్థం. కలికీ చిలుక లకొలికీ
అళిరవము ల కులికిపడితినమ్మా కొమ్మా
యెలనాగ కృష్ణ దేవుని
గులుకుచు నిటు దోడితేవె కుంజరయాన
ఏమే కొమ్మా కుందనిభ రదనా
కుంజనేత్రి నీకు చే కండ్లపొజుల
కమ్మలిచ్చి అంజలి చేసెదను పోవే
కుంజరయానా ఏమే కొమ్మా కుంజర యానా

కందార్థం. అడుగో మదనుడు వచ్చెన్
గడగడ మని దేహమెల్ల గంపము నొందెన్
దడబడె నా మృదుపదములు
వడతీ నీపైన గోప ప్రభు నికు దెమ్మా
మదనునిబారి పాలైతినమ్మా
ఏలాగు విరహాబ్ధి తాళదు నిదిగో, బాలరో
రత్నాలపతకము నీకిత్తు గోప బాలుని దెమ్మా....

కందార్థం. తుమ్మెదలు కదిఝుమ్మన
ముమ్మర మోహాబ్ధిలోన మునిగితి నకటా
కొమ్మా తాపము హెచ్చెను
అమ్మక్కా నే జెల్ల పొమ్మా హరినిటు దెమ్మా
నా ముద్రిక ఆనవాలిమ్మా
అరుదుగా నా కులుకుగుబ్బల నదిమి
చెక్కిళ్లంటి ముద్దిడి
సరసమాడే ప్రాణపతి ఏ సకియమరిగి
నను మరచినాడో
నీవేగి వేగ హరినిటు దెమ్మా

కందార్థం. దైవము నేమని దూరుదు
నే విధమున వాని గెల్తు ? నెట్లు సుఖింతున్
నా వలపు వ్యర్థమయ్యెను
భూవలయమునందు నిట్టి పుట్టుక లేదే ?
నావంటి యాడుపుట్టుక లేదే
నా వైనానికి బొలతీ దయలేదే
గట్టిగా జంద్రుండు వెన్నెల గాయగా
దుమ్మెదలు కలసి
అట్టె ఝుమ్మని మ్రోయగానే
అధికమౌతాపంబు హెచ్చెను
నావంటి యాడు పుట్టుకలేదే ॥

దరువు. ఏమి సేతునమ్మా అక్క నే నేమి సేతునమ్మ
ఏ యింతులగూడి యెలయు చున్నాడో

నిన్నను వానిమీది మోహముచే నేను
మోము మోపుసజేర్చి
మునిపంటను చురుకంటను
మోవినొక్కినంతలోనె
నొచ్చెనని అలిగి పోయెనే ....వా....దేమి
కలకంఠిరో వాని నేను కసిదీరను
కౌగిలింప మనసాయెమగువా, నేదు
మనవిని విని నా మగని తోడితేవే....ఏమి..
నల్లనివా డోయమ్మా
నా ప్రాణసఖుడమ్మా కొమ్మా
నీవు వేగ బోమ్మా గోపాలరాయని
దోడితేగదమ్మా....ఏమి..

దరువు. పదపద్మములు తడబడసాగె
పెదవి సారెకు నేమొ అదిరెనే
మాటిమాటికి గొప్పువీడెనే
తీని రెవికె పిక్కటిల్లెనే
సారెసారెకు పైట జారెనే
కులుకు గుబ్బలులోన జళికెనే
అదరి నా నడుమేమొ బెదరెనే
ఎడమ కన్నెడమ చన్నదరెనే
కల్లగాదె ఎదలో జల్లుమనె....పద....

కందార్థం. అకటా ఎట్లు దరింతును
సుకుమారుని దోడితేవె సుందర తన్వీ

యొకసారి నీకు మ్రొక్కెద
శుకపిక రావములు నన్ను సొలయించె నమ్మా
దేహము వాని సొమ్మనవమ్మా
విలసితంబుగ మందపవనుడు
వీసర బిసబిస కాకహెచ్చెను
చెలులలో నగుబాటుసేయక
కలికి నా ప్రాణేశు దేవే....సొలయిం ...

కందార్థం. లలనా విను శ్రీకృష్ణుడు
ఎలనాగలగూడి నన్ను నేచ దొడంగెన్
గలలోన గన్న కలిమియు
వలె నాయెను వానిపొందు వారిజవదనా

నానేరములేదాయెనమ్మా
సారెకు నాతోవైర మేమమ్మా
నే తాళలేనే - వారిజవదనా

దరువు. ఆశంతా యొక్కటికాదా
ఆడువారికి పగనిపట్ల - ఆశంతా
మోసమని తెలియక యే పాప
జాతిమందు పెట్టెనో - ఆశంతా
మందలించండి, యో మగువలారా
బుద్ధి చెప్పండి ఓ పూబోడులారా
మందరధరుడు నా మందిరమున కేలరాడు
సందేహమును వీడి మీరందరు
గూడి వానిని....మందలించండి.

మాయలాడి రుక్మిణి
మందుపెట్టినో కాని
మంచులు మాయలు నెరుగు...
ఏమమ్మా కొమ్మా...

కం. ఏకాంతను నమ్మను నే
నా కాంతుని దెచ్చెదేని నాతిరో విను...
చేకట్లా డిగపిచ్చెద
ప్రాకటముగ కృష్ణు చెమ్మ పంకజనేత్రి.

ఉ. పన్నుగ దక్షిణానిలుడు
పాంథులనేచ రతీశమిత్రుడై
యెన్నిక చంచరీకముల
నెంతయు గూడుక మ్రోయజేసెడిన్
దిన్నగనాపయిం నరుగు
డెంచి పికంబులు గూయజొచ్చె సం
పన్న సరంబులిచ్చెదను
పాండవబంధుని దోడి తేగదే

ఉ. చందనగంధి నా మనవి
చయ్యన దెల్పెద నాలకింపు మిం
పొందగ గృష్ణునాత్మ దల
పోయుచు శాంతతనుంటి రుక్మిణీ
మందిరమందు నున్న తని
మానిని తోడుకవచ్చెదేని నా
సుందెట దండలిచ్చెదను
చయ్యన గృష్ణుని తోడితేగదే

దరువు - రేగుప్తి - మిశ్రచాపు

నీవే పోయేవా - పిలువ నేనే వత్తునా ?
మాధవీ !
నేను వచ్చెదనంటె నీతిగాదె రంగడు
దానై వచ్చెడుదాక తాళలేనెకొమ్మా
కస్తూరివ్వెదనే మంచి
గజనిమ్మ పండ్లివె మాధవీ
మక్కువ సంపంగి మొల్లలివె
విలువ భూషణాలివె మాధవీ.,
ఆ మాయలమారి రుక్మిణి
మందుబెట్టెనో కాని
మందులు మాయలు నెరుగుదునా ?
ఏమమ్మా కొమ్మా
ఆ రుక్మిణీమణి నన్ను
వెక్కసంపుమాటలాడితేను
ఎక్కడ నే తాళుకొందునే ?
యేమమ్మా కొమ్మా ॥నీవే॥
చెలరేగి ఆమెతో
జదరంగ మాడుచుండ
జూచి మెటుల నోర్తునే
ఏమమ్మా కొమ్మా ॥నీవే॥
అల్లి ప్రేపల్లెవాసుని
యుల్లము రంజిల్లజేయు

పల్లవాధరిని నన్నేలుమనె ?
ఏమమ్మా కొమ్మా ॥సీవే॥
సఖీ, నా నాథున కా రుక్మిణి మందుబెట్టినదేమో ?

దరువు - శుద్ధసావేరి - అట

మందులమారి నాసవతి
ఏ మందు బెట్టుటకు దా నెవతో
మందయానరో తనకు మర్యాదగాదని
అందరిలోజెప్పి నిందించకున్నారే మందుల
ఎన్నోమాయలు నేర్చుకొన్నది
ఆ వెన్నుని దా జేర్చుకొన్నది
పిన్నపెద్దలనంపి పిలిపించి చెప్పరే
కన్నెరో యిటువంటి కార్యము వలదని
మగని నన్నెడ జాపె నమ్మ.
యింత మర్మము గలదటే కొమ్మా
మగువరో యిప్పుడు వగలాడి కీ బుద్ధి
తగదని మీరంత తగినట్టు చెప్పరే....మందుల
దోస మనుకొన దాయెనే - నాయుసు
రోసుకోక పూనదాయెనే
యే సీమలోనైన నిట్టు ఆడుదుంటే
వాసిగ గాపురము జేసేది లేదమ్మ మందుల
మేలుగ సిద్ధేంద్రస్వామి కృప నేలిన వైకుంఠధాముని
గేళికిరమ్మని కిటుకు పరచి మందు
లాలించి పతికి దాలబూలముతో బెట్టె.... మందుల

మం దు ల ప ట్టు

మా : మందులపెట్టి వశము చేసికొనుటకు నీపతి పసిపాప డటమ్మా ? అయినా నా మందులు ఎట్లు చేయుదురు, ఎట్లుపయోగింతురమ్మా మదవతీ....

సత్య : నీకేమి తెలియునే. పలు రకముల మందు లున్నవి. చెప్పెద వినుము.

సీ. కస్తూరిజాఫరా కరివేపపత్రంబు
తాళకంబును కొంతి రేలచిగురు
తామరదుంపయు ధవళాంశ పిప్పలి
పచ్చిపసుపును రేల బసవపత్రి
వినరాని మానుపైననులు వింగువరసం
బౌనర కన్నియ తేనె మునగమొగ్గ
గజనిమ్మఫలరస కర్పూరములు దెచ్చి
కరిమేకపాలతో గలియనూరి

గీ మాధవస్మరణచే నూరి మాత్ర జేసి
విడెములో నుంచి యిచ్చిన గడియలోన
నెచ్చటుండిన భ్రమ జెందివచ్చు నమ్మ
అన్నిమందుల కిది మేటి యౌషధంబు.

సఖి. ఇంక ననేకములు పెక్కుమందులు గలవేసఖీ.

ఉ. జిల్లేడు మొగ్గ, సంకుపొడి, జీలుగుపత్రర
సంబు, పిప్పలీ
నల్లని జీర, అంబుజము, నారింజవేరును,
శొంఠి, మిర్యముల్
చల్లనునూరి నా సవతి చాటుగ
పీడెమునందు నిచ్చెనో
వల్లభు డింక నన్ను దలంపడిక దాని
కుపాయ మేమొకో ?

గీ. లేగటిక వేరు, నిమ్మాకు, నెమలిబొంము,
కప్పురము, శొంఠి, దాళిమ్మ, కమలవిరులు
తేనెతోగూడ మర్దించి తేటదీసి
యిచ్చినట్లయిన వెనువెంట వచ్చునమ్మ.

గీ. పచ్చిపసుపును నూనె జాపత్రిరసము
మఱ్ఱిపాలను మర్దించి మాత్రచేసి
నేతితో రంగరించి బల్ నేర్పుతోడ
బైన జల్లిన గోర్కెలు పండునమ్మ.

మా : ఇదంతయు నా మాయావి రుక్మిణీ మాలలం దగుల్కొని నాపతి నన్నెడబాసి యుండెనేకాని వేరుగాదమ్మా. వేగమే నీవు పోయి నా నాధు నిటకు దేకున్న నిలువజాల నమ్మా కొమ్మా.

మా : సఖీ ! నీ నాధుని కొఱకు నేనెటకేగుదును ?

సత్య : ఎందున్నాడని చెప్పుదునే సఖీ ! షోడశసహ స్రాంగనా హృదయలోలుడు. ఇందుగల డిందులేడని యెట్లు తెలి యునే.

మా : సఖీ ! ఒకవేళ నీ నాథు డీ వనమునం దెందైన విహరించు చుండెనేమో వెదకుదమా ?

వ న వి హా ర ము

సత్య :

సీ. చూడరే సఖులార శోభనాకారు డీ
పొదలలో నేమైన నొదిగినాడొ,
అడుగరే చెలులార అంబుజాక్షుని రాక
చరుచైన వృక్షజాతముల నెల్ల,
వెదుకరే సతులార వెన్నుడీ పూచిన
పొన్నమానుల మీద నున్నవాడొ,
పిలువరే సఖులార లలితు డీ చెంగల్వ
కొలకుల చెంగట నిలిచినాడొ ?

గీ. రాజింతబైన చేతిలో రత్నమట్టె
నరవి బైజారవిడిచిన చందమాయె
ప్రాణవిభు డెందు దాగెనోగాని యతని
నే విధంబున గనుగొందునే లతాంగి ?

మా : సఖీ! ఇందెంత వెదకినను నెచ్చటను గానరా డమ్మా. ఆ మంజులతా నికుంజముల మాటున నున్నాడేమొ చూడమా.

సత్య :

ఉ. అల్లిన తీగెలార చెలువంద
ఫలించిన నిమ్మలార శో
భిల్లెడు జాజులార వెస బేర్మిలి
బూచిన మొల్లలార, యో
మల్లికలార యో కుసుమమంజరులార
మొరాలకించి నా
వల్లభు జూపరే సుకృతవంతులు
మీకిల బుణ్యమయ్యెడున్.

మా : సఖీ, ఇందెందును నీ నాథుని జాడ దెల్పువారు లేరు. ముందుగతి ఆలోచింపుము.

సత్య : ఇంక ముందుగతి యేమున్నదే ? ఆ రుక్మిణీ కేళికామందిరంబునందే ఉండునే.

దరువు. పదపద్మములు తడబడసాగె
పెదవిసారెకునేమొ అదిరెనే
మాటిమాటికి కొప్పువీడెనే రీవి
రెవికె పిక్కటిల్లెనే
సారె సారెకు పైట జారెనే కులుకు
గుబ్బలలోను జళికెనే
అదరి నా నడుమేమొ బెదరెనే
ఎడమ కన్నెదమ చన్నదిరినే

కల్లగాదె ఎదలో జిల్లుమనె....

సఖీ! ఏమియు దోచకున్నదే.

మా : ఈ మావిగున్న నీడ నించుక విశ్రమించుము సుదతీ.

సత్య : నా సవతి రుక్మిణీతంత్రము చే నెంత వేగుచుంటినే.

దరువు — ఝంఝూటి — ఆది

మాయలాడి నా సామికి మందుపెట్టెనే
మందు బెట్టెనే ఏమొ మాయజేసెనే
ఆటలకు బాటలకు ధాటిగలవాడని
వాటమైన యొకచోటికి రమ్మని...మాయలాడి
కమ్మని జుంటితేనె గలిపి నాసామికి
కొమ్మా కొమ్మని కొసరికొసరి...మాయలాడి

కందార్థం. రాకాచందురు వెన్నెల
కాకాయె వికేమిసేతు గాముని బలముల్
చీకాకు పేయబూనెను
చేకొనరా వింకనైన చిత్తమురాదా
నాపై వానికి నిత్తరి లేదా
తత్తరముగ నా గుత్తంపు గుబ్బల
నొత్తి పట్టుక నన్ను నెత్తికౌగిట జేర్చ
చిత్తమురాదా నాపై వానికి ...

దరువు. భామినీమణి నాప్రాణేశుదెచ్చిన
నీమేలు మరువజాలనే
వాని ననుగూర్చి కామునిబారి గడుపవే
యీ బా - సా - ర కాపాడవే
కందర్పజనకు దే కాంతనో గూడి నే
డింటు రాడాయె నేనేమి సేతు....
మందమలయానిలుడు మరి వీవ సాగెను
ఇందుని కాకల గుండె మేను....

దరువు. కుందరదనా నా మందిరమునకును
సుందరాంగు దేగదే
డెందే గానందము చెందియుండునే
భామినీమణీ. నన్ను బాలప్రాయమునాడు
కామించి బహువిధగతులనేలి
యేమిపాపమొకాని యిప్పుడిల్లెడబాపి
కామునిబారి కగ్గలముచేసె....

దరువు ఏమి సేయుదునే నేరీతి దాళుదు
నేమని తెలుపుదునే
ప్రేమతో నాసామి నన్నుగూర్పవే
వాని నన్నుగూర్పవే
లాలించి కౌగిట గీలించి నగవుల
చేమించి మిక్కిలిప్రేమనించి

వాలాయము వరించి వలరాజు కేళి నను
  పోలించి కరిగించి చూచి విభుని

దరువు. ఎంతకని వేగింతునే లలనా ఎంత
ఎంతకని వేగింతునే పీ రెవరని సాధింతునే
ఇంత ప్రొద్దయ్యె నేడిక శ్రీకాంతు డిటకు
  రాడాయె ....
ఎందుకే యీగంధము ఎందుకే యీ బంధము
ఎవరు చూచినయందము
ఇందుముఖి మోవితేనె విందుజేయరమ్మనవె.

ఉ. ప్రాయమువ్యర్థమమ్మ పతిబాసి
  తొరంగిన నాటనుండి నా
కాయము తాళదమ్మ అలకాయజు
  డేయు సుమాస్త్రధాటికిన్
వ్రాయవెకిమ్మ వేగముగ వ్రాయక
  ప్రాణము నిల్వదమ్మ నా
నాయకు డున్న చోటికిక నమ్మిన
  దూతిక నీ వరుంగుమా ....

దరువు — ఆసావేరి — త్రిపుట

తాళవియ్యదే మోహము ఓచెలియరో
నిలువనియ్యదే దేహము

బాలా ఏలకిపూల నోలలాడి చాలగ

పన్నీరు చల్లుకొన్నగాని.... తాళ

మా : ఇట్టి శైత్యోపచారంబు లెన్ని జేసినను మనోతాపంబు చల్లారునా ? ఏల బేలవై యీలీల దురపిల్లెదవు చెలీ ?

సత్య : కమ్మపూ విల్కాని తూపుల మేను

సొమ్మసిల్లెనే

ఝుమ్మని తుమ్మెదలిమ్ముగ వెగురగ

నెమ్మిగుబ్బలపొమ్ము గ్రుమ్మ

కొన్నగాని.... తాళ...

మా : అమ్మా, త్వరపడిన గార్యంబగునా నీ నాథు డెందున్నాడో అరసికొని తెచ్చుట అంత సులభసాధ్యమగు పని

దరువు :

26 సత్య : భరియించజాల యౌవనప్రాయ

భరమోర్వ జాల

విరహవేదనచే నే తెరువుదోచదే చెలియా

త్వరగా నరిగి గృష్ణు నిరవు జేరి

తేతున్న... భరియింప....

27 మా : సఖీ అట్లుచేసి పోయివచ్చెదను. కాని శ్రీకృష్ణ స్వామివారి సన్నిధికేగు నప్పుడు ఈ జీర్ణ వస్త్రముతో అలంకార

ఖాస్యమగు యీ రూపముతో బోయినచో సవతి వా
నన్ను జూచినవ్వరా? అదిగాక నేను సత్యభామా దూతి
నని చెప్పిన మీ సవతు లందరు హేళనము సేయరా
ఆలోచించుము.

సత్య : సఖీ! తెలిసినది. నాకు దుకూలాంబరము లెన్ని యో
లవు. నీకు వలయు చీరెలధరించి పోయిరమ్మా. ఇంక
నీకేమి యాభరణములు కావలెనో గైకొమ్మా.

మా : చెలీ! ఈ వస్త్రాభరణములకు సంతసించితిని. కాని ఒక్క
మాట. సఖీ! నీకుగల యాభరణంబులలో నీకు మిగుల
ప్రియమైనవేవి చెప్పుము.

28 సత్య: నాకు ఏడువారముల సొమ్ములు గలవు. అవి నాకు
ప్రియకరములైనవి. సూర్యచంద్రాది సప్తగ్రహాధిపత్య
ములుగల ఆ సొమ్ములు నే నెప్పుడు ధరించు చుందు
నమ్మా.

మా : వాని విశేషమేమి సఖీ!

సత్య : అదివారపు సొమ్ములకు సూర్యుం డధిపతియైనందున
నాడు ఆ యాభరణంబులం దాల్చి ప్రియునకు హితమును
గలిగింతును. ఇట్లు వరుసగ నేడు వారముల సొమ్ములు
ధరించుచుందును. సఖీ! ఆ యాభరణముల వివరుల
కీయరాదమ్మా.

మా : వానిని గూడ నేను ధరించి నీ ప్రియుని రప్పింపజేసి నా వెంటనే వాని నీకడకుగొని తెత్తును. ఏడువారముల నగలను నేను ధరించినగాని పోపజాలనమ్మా సుదతీ!

సత్య : అటులనే ఇచ్చెదను వేగమ పోయిరావమ్మా. ఇంకను నాకు విడికుచ్చులు విరిపండలు నేవళము చిల్కతాళి పౌజులకమ్మలు పాపట బొట్టు చేకట్లు మొదలగున వెన్నియో గలవు వానిని గూడ నొసంగెదను చేకొనుము సఖీ!

కందార్థం. శ్రీదయితుడు రాకుండిన
నేదియు మది దోచదమ్మ ఎప్పుడుకొమ్మా
వాదంబు మాని వేగమె
నా దయితుని కడకు జనవె నా దయగొనవె.
వానికి ప్రీతి లేదాయె వినవే
ఆదివారపు సొమ్ము వేదనకిచ్చెద
యాటపవీరుని మోదమొప్పదెచ్చి
నా దయగొనవె

మా : సఖీ! సోమవారముసొమ్ము కూడ యిప్పించుమమ్మా.

సత్య :

కందార్థం. తామస మేమియు పీడరు
కాముండును సోముడెంతొ కఠినులు వారి

వేమారును బ్రతిమాలగ
లేమిక యిటులేచిరావె లేమరో పోవే
చక్కని మేఘశ్యాముని దేవే
సోమవారపుసొమ్ము కోమలీ యొసగెద
ప్రేమమీరగ నేడు కాముతండ్రికడకు
లేమరో పోవే.

మా : అమ్మా! గ్రహములలో నంగారకుడు దోసకారి వానివి సంతసింపజేసినగాని మనకు సాయపడడు. కనుక మంగళ వారపు సొమ్ములు కూడ యిప్పించినచో బోయెదనమ్మా.

సత్య :

కందార్థం. రంగుగ బూపాన్పున బహు
భంగుల రతికేళిదేలు పతిజూడక నీ
అంగజుధాటికి నిక నె
బ్బంగిని నిలనిల్తునమ్మ బంగారుబొమ్మ
శౌరితో నీ ప్రసంగము దెమ్మా
మంగళవార మువ్వొంగితాల్చెడు సొమ్ము
సంగతిమీర నొసంగెద బతి దెమ్మా

మా : అమ్మా! బుధుని యాభరణములు ధరించినచో నతడు సంతసించి నాకు సాయపడును, కాన బుధవారపు సొమ్ములు కూడ నిప్పించినచో వానిని ధరించి పోయి వచ్చెద సఖీ!

సత్య :

కందార్థం. విధవిధముల నా నాథుని
యధరసుధారసము ప్రీతి నానక యిక యీ
విధమున నుండుటగని మ
న్మధు డేచునే ముద్దుగుమ్మ మధురిపు డెమ్మా
బుధవారపుసొమ్ము మధురోష్ఠి నీమాట
వృధసేయకొనగెద విభుని బల్మి దేర

మా : బృహస్పతి దేవతలకు గురువు. వారి యాభరణములు ధరించినచో శ్రీస్వామి వారికి మిగుల ప్రీతి. కాన నే నేగు కార్యము వెనువెంటనే ఫలించును, కాన గురువారపు సొమ్ములుకూడ యిమ్ము సఖీ!

సత్య :

కందార్థం. అరగంటగ మునివంటను
సరసుడు కెమ్మోవి నొక్క జాల్పడు మనినన్
కిరమున్ పీడని విభు డల
తరలాక్షికి దక్కెగదవే తరుణిరో పోవే
నానాథు దెచ్చి సిరు లెల్ల గొనవే
గురువారపు సొమ్ము సరసిజముఖి నీకు
స్థిరముగ నిచ్చెద మరువితంద్రికడకు
తరుణిరో పోవే...

మా : శుక్రవారమునకు దనుజగురు డధిపతి. శుక్రునికి ప్రీతి కరములగు నాభరణములు ధరించినచో సకలారిష్టములు

హించి పోయిన కార్యము సిద్ధించును. కాన శుక్రవారపు సొమ్ములు కూడ యిచ్చి పంపవమ్మా సఖీ!

సత్య :

కందార్థం అక్రూరవరదు మది గని
వక్రత్వముబూని మరుడువారి జవృడున్
విక్రమము జూప బూనిరి
చక్ర స్తని యోర్వజాల జక్రిని దేవే
పాలిత భ ర్త శక్రుకుసూవె ?
శుక్రవారపు సొమ్మ నే క్రియనైన ని
ర్వక్రత నిచ్చెద శక్రినిర్మితమిది - చక్రిని దేవే.

మా : అమ్మా ఆభరణము లన్నియు నొసంగితివి. తప్పక నీ నాథు డేతెంచును. అరిష్టకారకుడగు శనికి ప్రీతికరములగు శనివారపు సొమ్ములు కూడ ధరించినచో నింక నేకొరతయు నుండదు కాన శనివారపు సొమ్ములుకూడ నొసంగినచో ధరించి పోయివచ్చెదను సఖీ!

సత్య :

కందార్థం. వినుమా అనుమానము విడి
చనుమా వనమాలికిడకు జని సఖి యిక లే
దనుమా తను మానక యికలే
దనుమా నవకుందరదన అనుపమవదనా!
జాలముచేసి చననిది యదనా ?
శనివారపుసొమ్ము వనజాక్షి యొసగెద
వెనయగ నకర కంటీశుని నిటుదేవే అనుపమవదనా!

సఖీ ఏడువారపుల సొమ్ములిచ్చితిని ఇక పోయిరావే.

మా : అమ్మా యింకను నీకు గల యాభరణములు చెప్పవమ్మా.

సత్య : ఇంకను చాలగలవే. వడికుచ్చులు. విరిదండలు నేవళము, చిల్లతాళి, పౌజాల ఓమ్మలు, పాపటబొట్టు, చేకట్లు, రాగిడి, చంద్రవంక. సూర్యచంద్రులు, పాపట ఓందిసీలు, అడ్డ బాస, ముక్కెర...

29 మా: ఆగు ఆగు సుదతీ! ఆ ముక్కెర నొక్కటి యిచ్చినజాలు నమ్మా! పోయివచ్చెదను.

30 సత్య: సఖీ! ముక్కుముంగెరటవే. హరి హరి ! ఓయమ్మ ఎంతమాటంటివే ! స్త్రీలకు సమస్తాభరణము లున్నను ముంగెరలేనిచో నా యాభరణములన్నియూ వృధాయగునే. దాని నొరులకీయరాదే.

ఉ. అంగనలేని యిల్లు, చతు
రంగ బలంబులులేని రాజు, ని
స్సంగుడుకాని మౌని, జన
సమ్మతి లేని ప్రధాని, బోటిరో
బంగరులేని రత్నమును,
భాగ్యములేని నరుండు, స్త్రీలకున్
ముంగెరలేని భూషణము,
మోదము గూర్చునే భామినీ మణీ !

31 మా: ఇంక నేమి? ముక్కెరలేని యితర భూషణములన్నియు వ్యర్థములని నీనే చెప్పుచుంటివిగదా। ముక్కెర లేని యీ యాభరణములు ధరించి నేను పోవగ జాలనమ్మా.

32 సత్య: అటులబోయెదవేమే, ముంగెర కూడ నొసంగెదను రావే, సఖీ।

సంవాద దరువు – యదుకులకాంభోజి – త్రిశ్రగతి.

33 సత్య: వాదమేల పోవే చెలి! నాధునిందు దేవే .. వాద
ఆదరింపనీవే నా కాదరువైనావే ...వాద...

మా : భేదమెంచనేలా మరుబాధ చూడజాల .. భేద
బోధసేయనేల నీ నాథుదెత్తు బాలా...

సత్య : నిక్కము తులమెత్తు నా ముక్కు నున్న
నత్తు నీ
చక్కని ముఖమెత్తు చేర్చుక్క బొట్టునిత్తు
....వాద....

మా : అక్కరో వినవమ్మ నీమక్కువ దీర్తునమ్మ
టక్కులుగావమ్మ నను నిక్కము
నమ్మవమ్మ...భేద....

సత్య : అసలు వ్యర్థమాయె నాయాస మధికమాయె, వాని
బాసలు కల్లలాయె కడు దోసకారియైనా కే
....వాద....

మా : అంగన వినవమ్మ ప్రసంగము లేలనమ్మ
ముంగెర నిటులిమ్మా శ్రీరంగని
దెత్తునమ్మా...భేద....

సత్య : బంగరు వరబొమ్మా! నను
భంగపఱవకమ్మా యొక
సంగతి వినవమ్మా ముక్కు
ముంగెర గొనిపొమ్మా ...

ఉ. ఓర్వగలేదు మీ వదప
యోజనములన్ మదినమ్మియున్న నన్
గర్వమునన్ మరుండు సలు
కన్ సుమబాణము లేయుచుండగా
శర్వరినాథు డెంతయు వె
సన్ దగ వెన్నెలగాయుచుండగా
సర్వనిప్రాణముల్ విలుప
నోర్వఁడటంచును దెల్పుమా సఖీ!

చెలీ! సకలదుకూలాంబరాభరణము లొసంగితిని, ఇక నా నాధునితో నా యుదంతమును దెల్పి కొనిరావే.

34 మా: సఖీ, నీవు దెలిపిన సంగతులన్నియు శ్రీకృష్ణస్వామివారి! దెల్పుటకు నాకు జ్ఞాపకమునకురావు, ఒక కాబు వ్రాసి యిచ్చినచో గొంపిపోయెదనమ్మా.

సత్య: సఖీ! నే జెప్పు సంగతులన్నియు నొకతాళ పత్రముపై లిఖియించవే.

మా : (దక్షిణాభిముఖము గూర్చొని వ్రాయబోవును)

సత్య: చెలీ, దక్షిణదిశకై కూర్చొనివ్రాయరాదే.

కం. అక్షరవంతుండైన స
లక్షణముగ వ్రాయగల్గు లలితుండైనన్
లక్షణకోవిదుడైనను
దక్షిణముఖముగను వ్రాయ దప్పులుదొరలున్

మా : పనికిరాని దిక్కులేవి. సుముఖమైన దిక్కులేవి తెలుపుము సఖీ!

సత్య: దక్షిణ పశ్చిమ దిశల కభిముఖముగ వ్రాయరాదే. తూర్పు దిశ ఉత్తరదిశ యోగ్యములే సఖీ!

కం. శూరులు చెంతనుగల్గిన
గూరిమి రంజిల్లకున్న గుదురుగ వ్రాయ
న్నేరకయుండిన జెలియా
తూరుపుముఖమైన వ్రాత తులదూగించున్.

కం. తత్తరపడిలిఖియించిన
జిత్తమురంజిల్లకున్న జిడిముడి పడినన్
మెత్తనిలేఖరి యైనన్
ఉత్తరముఖమైన వ్రాత యొప్పుచునుండున్

35 సఖీ! తూర్పుముఖముగ గూర్చుండి నే జెప్పునది వ్రాయవే.

మా : సిద్ధముగ నుంటివి చెప్పుము చెలీ.

ఉత్తరము

36 సత్య:శ్రీమద్రత్నాకరపుత్రికా ముఖారవింద మరందపానపరవశ మిళిందాయమానా! నందనందనా! ముచుకుందవరదా! మంద రాధరా! పరిహాసితరాకాసుధాకరసుందర వదనారవిందా! భవచ్చరణారవిందంబులకు సత్యభామవిటలతట ఘటిత కరకమలయై అనేక సాష్టాంగప్రణామంబులాచరించి చేయు విన్నపము.

ఇచ్చటకుశలము. భవదీయ సకల సామ్రాజ్య వైభవశ్రీ విశేషంబులు దెలుపగోరుచుంటి.

మజ్జనకుండు నన్ను దమకునొసంగి వివాహంబొనర్చిన ప్రభృతి వజ్రవైడూర్యగోమేధిక పుష్యరాగాదిమణి ఖచిత స్వర్ణసౌధాతరస్థ చకచకితపద్మరాగమరకత మహోపల శకల ప్రకల్పిత నానావిధ చిత్రవిచిత్రజాంబూనదరత్న మండితంబగుహంసతూలికా తల్పంబున దివ్యమంగళ

విగ్రహాకారులగు తమపర్యంకంబున చేర్చి శయనించి యున్న నన్ను గాఢాలింగనంబొనర్చి యుపరతి సమరతులం దేలుచు నాత్మాహ్లాదకరంబుగ మెలంగుచున్నంత నన్ను విస్మరించి దమచిత్తంబు రుక్మిణీసతియందు నిలిపి తమకు ప్రాణసఖినగు నాయెడ నిర్దయులై గతినమనస్కులైండవై కినుక బూని నన్ను విడనాడి తొలంగియున్న నాటనుండి మారుండు క్రూరుండై నిశితకుసుమశరసూతంబుల హృదయంబు భిన్నంబుగానొనర్చె; కీరంబులు క్రూరంబుగ నవారితారావంబులు సేయుచుండె శుకపిక నికరంబులు కీచుల కరణింగూయదొడంగె. తుమ్మెదల నాదమ్ములు తలదిమ్ము ఘటించె, చంద్రుండు సాంద్రంబుగ వెన్నెల గురియించె, మలయానిలుడు కాలానలతుల్యంబుగ మారుతంబు వీచె, కావున ననేకపద్మజాండంబులు బొజ్జనుంచుకొని సత్వరజస్తమోగుణ ప్రేరితంబులగు లోకములకు రక్షకుండవగుచు సకలాభీష్టవరంబులొసంగు దొరవని నెమ్మనంబున నిశ్చయంబుగ నమ్మి త్వత్పాదాంబుజధ్యాయినియైన నన్ను యీ క్రూరాత్ములబారిం బడద్రోసి మన్మందిరంబునకు రాక నావంటి యబలయెడ చలంబు బూనుట ధర్మంబుగాదు. కాన నన్నుగరుణించి యిటకువిచ్చేసి మదీయ వాంఛితంబు సాఫల్యంబొనరించి నన్నీ క్రూరాత్ములు చేయు బాధలనొందనీక మకరకేతనకేళిం దనిసి, ననుసంతసంబు నొందించి రక్షించగలరని వాంఛించుచున్నాను.

ఉ. 37 చిత్తజబాధాటికిన్ వెరచి
సేవకురాలు లిఖించి పంపె నీ
యుత్తర, మిందులో దొరలి
యుండును తప్పులు పెక్కు, వాని మీ
చిత్తమునందు నిల్పి యెడ
సేయక వచ్చెద నంచు వ్రాసి మా
రుత్తరమిచ్చి పంపక న
యౌన్నత యీచెలి వెంటరాగదే

ఇట్లు,
భవచ్చరణదాసి
సత్యభామ.

దూతికారాయబారము

సఖీ! శ్రీ స్వామివారి జెంతకు నీవు రాయబారము పోయి రావమ్మా

దరువు. రాయబేరమే పోయి రాగదమ్మా కొమ్మ
వేవేగ వానితోడి తేగదమ్మా కొమ్మ ||రాయ||
మాయలమారి దాని మాటనమ్మి నాయెడ
బాయుట యిది తనకు న్యాయమా శ్రేయమా
ఓయమ్మ ఇకనైన రాయబేరమే పోయిరమ్మా

రా: సఖీ! ఇక నేను పోయివత్తునమ్మా

త్య: స్వామివారితో మనవిచేయుటకు సమయాసమయంబులు గుర్తించవలయునే సఖీ!

సీ. భుజియించి శలపథంబులు ద్రొక్కుచున్నను
చెలగి తాంబూలంబు వేయుచున్న
చతురత నళిదంబు జళిపించుచున్నప్పు
డొంటరిగా నేగుచున్న యప్డు
కమ్మపూజంతు లాఘ్రాణించు చున్నను
సుముఖుడై యద్దంబు చూచునప్డు
గానంబు విని సొక్కి మానితంబుగ నున్న
హాసుగా బురవీధి కరుగుచున్న
ముద్దుకొమరుండు దొడలపై మురియుచున్న
శ్వశురగృహమందు సుఖగోష్ఠి జరుపుచున్న
మలయపవనమున వాహ్యాళి మెలగుచున్న
ప్రభునకావేళ జెప్పంగవచ్చు మనవి.

ఇక సమయములు కాని వానిని దెల్పెద వినవమ్మా సఖీ.

సీ. ఖటగజఘోటక ప్రకరవీక్షణుడైన
దండయాత్రోత్సాహదర్పుడైన
ధూర్తుల రణవీధి దునుమాడివచ్చిన
వరయ రౌతులయిండ్ల కరుగుచున్న
రాయబారపుగోష్ఠి రంజిల్లుకొలువున్న
అన్యకాంతాసక్తి నరుగుచున్న
భోజన మజ్జనంబులకు వేళయియున్న
నిజదేవతాధ్యాన నిరతుడైన

మోహపుజూపు మనుమీ
ఇవిగో మొగలిరేకు లనుమీ
మొనసిన విరులపాన్పుపయి
ముదిత యున్నదనుమీ ఓయమ్మ
బాలరో వినవే అతడు నా
పాలిదేవు డనుమీ
బాలమదన గోపాలరాయ
వెతబాయజాల ననుమీ ఓయమ్మ.

కం. ఘనమైన నాదు కుచముల
దన నఖములు నిల్పి నన్ను దప్పకు కేళిన్
బెనగిన కథ మరుపకుమని
వినయముగా దెలుపుమమ్మ వికచాబ్జముఖీ.

కం. చొక్కపు చక్కెర బొమ్మను
చక్కని రాకేందుముఖిని జలజదళాక్షిన్
మిక్కిలి మక్కువతో మా
యక్కను రుక్మిణిని జాల నడిగితి ననుమీ.

చం. చటులమనోజవహ్ని గుచ
చందన కస్తురి పంకమయ్యె, నా
రటమున మౌక్తికామణులు
రాజితరత్నములయ్యె హేమ సం
ఘటిత మనోహరాభరణ
కాంతి సముజ్వలమయ్యె నింక నా

ఓటికెని వ్రేలి యుంగరము
చేడియు మొద్దణమయ్యె దెల్పవే.

గీ. తిడవుసేయబోకు తమకించి రాబోకు
పలుకు నెడల ఘాత పలుకబోకు
చుల్కపడక వాని జూచి మోమోడక
కార్యసిద్ధి గొనవె కంబుకంఠి.

మాధవీ! స్వామివారి చెంతకేగునప్పుడు మంచి శకునములు చూచి పోవలెనే.

మా : మంచి శకునము లెవ్వియో చెడ్డ శకునము లెవ్వియో నాకు తెలియదు. తెలుపవమ్మా సఖీ!

శకునములపట్టు

సత : సుశకునము దెల్పెద వినుము;
కన్యాగౌశ్శంఖ భేర్యో దధిఫలకుసుమే
పావకో దీప్యమానః
గానంవా విప్రయుగ్మం హయ గజ
వృషభాః పూర్ణకుంభద్వయంచ
ఉద్ధృతం మాంసఖండం జలచరయుగళం
శుద్ధమన్నం శివం వా
వేశ్యాస్త్రీ మదభాండం ప్రియహిత
వచనం మంగళే ప్రస్తుతాని.

కన్య, గోవు, శంఖము, భేరి, పెరుగు, పండ్లు, పువ్వు

ములు, మండుచున్న నిప్పు, సంగీతము, బ్రాహ్మణుల జంట, గుఱ్ఱము, ఏనుగు, ఎద్దు, నీటికావడి, రక్తముతో కూడిన మాంసఖండము, మత్స్యములు, అన్నము, సక్కు, వేశ్య, సురాభాండము, ప్రియమగు మాటలు ఇవి మంచి శకునములు, మరియు ఇక దుశ్శకునము తెలిపెదను సఖీ।

చం. పిడుకల గంప, నూనె, తిల
పిష్టము, నల్లలు చాకిమూటయున్
కడవలమోపు, మాదియును,
గాషము, కంబళి, యొంటివిప్రుడున్
జడమతి, అంగహీనుడు, వేడి వ్యాధుడ న్
బడతిరో దూరయాత్రకు
ననర్థము లీ శకునంబు లెంతయున్.

38 సఖీ! మంచి శకునము చూచి పయనమైపోయి సుసమయమును గుర్తించి శ్రీ స్వామివారికి నా మనవిని దెలిపి వెంటగొని రమ్మి. పొమ్మిసఖీ! అదిగో మంచి శకునములే యగుచున్నవి.

దరువు - దర్బారు - రూపకతాళం

శకునమాయెనే చెలీ
అగణిత యశుడై మనన
నగధరుని బిలువంగబోవ ॥శకున॥
పాలదీర్చెనే చెలి శ్రీలోలుం డనుకూలుడౌనె
జాలము సేయకను శ్రీ కుచేలపురి
గోపాలు కడకేగగ.... ॥శకున॥

దరువు - మోహన - అది

శకునాలు మంచివాయెనమ్మా
ఓయమ్మలారా || శకున ||
శకునాలు మంచివాయె
సఖుని రాకను తెల్పె || శకున ||
గరుడుడు పొంగి తిరిగెనమ్మా
ఇష్టమై యెడమ భుజము సొదగంటెనమ్మా
శుకపిక పై డిగంటలు
కిలకిల పల్కెనోయమ్మా || శకున ||
ఉత్తరాన బల్లి పలికెనమ్మ ఓయమ్మలారా
పదపుట పాలదీర్చెనమ్మ
ముత్తయిదువ లిద్దరు హత్తుకొని
యెదుట వచ్చిరమ్మా
ఇత్తరి నా ప్రాణనాదు డిపుడె
వచ్చునా బోలు || శకున ||
భూసురు లిద్దరెదురైరమ్మ పూర్ణకుంభములు
శిరమున నిడుకొనిరమ్మా
వనజాక్షి నావిభుడైన వాడు వచ్చునా బోలు

సఖి: మంచి శకునము లగుచున్నవి, వేగబోయిరమ్మా.

దరువు - పూరికల్యాణి - మిశ్రచాపు

పోయిరాగదవమ్మా కృష్ణు కడకు ||పోయిరా||
తోయజానన ఆ మాయలాడిని గూడి
ఏ యందమున నున్నాడో అది వినవలె ||పోయిరా||

చాలగ పలిగాలి కీలి పోలిక పీప
నేలాగు విలనిల్తునే యీ మరు
విరి కోలల కెటులోర్తునే
మేలు మేలిక జాలమేల ? తాళజాల
ప్రాలుమాలిక మాని బాలసాళుప లీల ॥పోయిరా॥

మానకనుమా ంచి కానిపోని ...ని
పైనము కనుగొంచనే యీ భ్రమలింక
మానుద మనుకొంటినే
మానుగ బై పైన సూనబాణములు
నేనే నేనని పూని నా పైన గపెపె
॥పోయిరా॥

అంటిన పగ వెంట నంట టుంటరి తుంట
వింటివాని జోడుగా శ్రీనకర
కంటికుటిలకు రాదు...
కంటి జంటగ వాల్గంటి మింటను జేసి
మంటమండగ నొంటి నుండ
గొంటగు వించె ॥పోయిరా॥

మ, తరుణీ నీవిపుడేగి భీష్మకసు
తాధామంబులో శౌరి యే
పరణిన్ వర్తిలుచున్నవాడా వినుమా
చందంబు వీక్షింపగా

స॥ నీజాయత నేత్రి నీమదికి వి
    ష్టబొంచు జూపట్టెనా
హరితో నావిధమెల్ల యుక్తముగ
    నేకాంతంబునన్ తెల్పవే.

మన్మథదూషణ

దరువు -- ముఖారిరాగం — ఆది

ఎవరే ఎదుటవచ్చే వారెవరే ఓ లలనా యేమే
మంచి యౌవనమైన రూపకుఁ వా రెవరే...
వెచ్చని గాడ్పులు పై పై వచ్చెనే మరుడు
పచ్చవింట శరము లెక్కించెనే ॥ఎవరే॥

దరువు – ఆనందభైరవి – ఆది

వచ్చెనదిగో మరుడు
    వచ్చెనదిగో అమ్మలారా
వచ్చెనదిగో చెచ్చెరంబున
    పచ్చవిల్తుడు మచ్చరంబున
విచ్చుకత్తి తళుక్కుమనగా
    నిచ్చటికి వేవేగ విప్పుడు ॥వచ్చె॥
బారుకోవెలమూక కూయగ ఓ అమ్మలారా
బారుకోవెలమూక కూయగ దావల మం
దారుచల్లగాలి వీవగా వెలవల జామా
దారుడు చంద్రుండు చల్లగా, ముంగాలను బే
దారుడు వసంతుడు హెచ్చుగా... ॥వచ్చె॥

దరువు. అదుగోనే మదనుడు వచ్చె చూ....డదుగోనే
అడుగోనే మదనుడు అలరుపూపొదరిండ్ల
వడివడిగ వచ్చె వనజాక్షిరో చూడు... ॥అడుగో॥
తమ్మి గేదగిరేకు కఠారి బూనుక
వన్నెమీఁగ వచ్చె వనజాక్షిరో చూడు... ॥అదుగో॥
పసుపు నిగ్గులవంటి పచ్చ చేమ తుం
పసుపు బుటేదారు పాగాజుట్టినా... ॥అదుగో॥
జాజిపూ మొగ్గః పీమా జ్వానూతొడిగిన
రాజగోపాలుడు వీడె రాజవదనా... ॥అడుగో॥

కం గంధగజ స్కంధంబున
బంధురవ గ భేరి వేసి పటునారి తగన్
ధంధం ధణ ధంధం ధణ
ధంధం దణనాద మొనగ ధరణి వడంకెన్.

సీ. అదె హుటాహుటి నొక్క
కొదమతుమ్మెద వచ్చి
పొరిది పుష్పవనంబు జూచిపోయె
అదె మిన్ను దిగివచ్చి మదవ న్మరాళంబు
కమలకాసారంబు గాంచిపోయె
అదె వేటువడి వచ్చి కొదమ కీరంబొండు
తియ్యమామిడి తోట తిరిగిపోయె
అదె నారు తీరైన ప్రాయంపు కోకిల

దట్టంపు లేదోట మెట్టిపోయె
మదను డెచ్చోట నుండియో కదలివచ్చె
కాము దేతోపు జొచ్చెనో కానరా
కాంతు డేమాయ పన్నెనోకాని యెంతొ
వింతలై దోచె నేడహో యింతులార.

ఉ. మారి ఇదేమిరా శరసు
మంబుల నా కుచచూచుకాళిపై
సారెకు నేయజూచెదవు
జక్కవలో గజనిమ్మపండులో
వారకి బొంగరాలొ మద
వారణకుంభములో నగంబులో
కారణమేమి? గుబ్బలు వ
కావకిలై నను దోసమే కదా.

ఉ పాపివటంచు నీదు ముఖ
పద్మము చూచి సహింపలేక సం
తాపమునొంది విష్ణుదవ
తాంపులెత్తగ బూనె మించు నీ
చాపము నీ బలంబు శర
జాలము కంటివిగాని దీనిచే
నేపునగల్గునింద గణి
యింపక పోతివిగా రతీపతీ.

విమలంబైన కమలంబులు బాణంబులుగా జేసి, యేపుమీర
మారుడు తూపు లేయదొడంగె, యీ తాపమెట్లోర్తునే ?

పంచ. పతాణి రౌతు ఠీకునన్

మితారమైన క్రౌన్ననల్

కతారిగానమర్చి బిల్

గటాయితంబుగా జమల్

తుటాల్తుటాలు సేయబూనె

ద్రోవ బాసి గనే

యిటో యెటో యటో గదమ్మ

ఏమిసేతు ? మారుడే...

మెరుంగువాడు తూపులున్

కురంగలోచనాళిపై

తురంగమెక్కి బంకులున్

మెరుంగు బోణులన్ వెతల్

దొరంగజేయుచున్ బళిం

మరంగు లంగులంతకంతకున్

భరంబుతోడ వచ్చెనంత

పావజాతిమారుడే...

అభుగ్గమల్ జమల్లటంచు

స్వార్భటంబుగా జనన్

దభుక్తభుక్తభుక్కటంచు

దండివచ్చె దేరగా

చలచ్చలచ్చటాయటంచు
జప్పుడింపు వేగమే
ఛళాభళాభళా యటంచు
వచ్చె క్రూరసూరుడే.
కటీ పిటీ విటీ జనంబు
కాకమాటలాడగా
తుటాలునన్ మిటారికాడు
తుంటవింటనంటగా
దుటీతుటీతుటీ శరంబు
తూరి పారవేసె న
క్కటాకటా కటారికాడు
కాముడెంత శూరుడే.
పరీపరీపరీవిధాల బల్క
చిల్కగుబ్బముల్
మరీమరీ మరండు నెక్కి
మావిడాకువంకెనున్
కరీకరీకరీని గ్రుమ్మి
కల్కి రాజగమనుడే
హరీహరీహరీ అతనుడు
అహహా ఎంతశూరుడే!

దూతి: అవిగో మంటలు, ఆ మంటలకు ఆ మన్మథుడే ను బాణములకు ఆ చిలుకల పలుకులకు తుమ్మెదల రొదలకు కోయిల రుతములకు తాళలేకుంటినే.

దరువు చెఱకు విల్తుడు వెడలెనే
యీవేళ నాపై... ॥ చెఱకు ॥
చెఱకువిల్తుడు చురుకు
చురుకని యురము దూయ
కంకుటమ్ములు కరుకు
కరుక్కని నాటింప... ॥ చెఱకు ॥
తూరి గేదంగి కఠారి చేబూనుక తా
టారింపుచు మితిమీరి
సారె సారెకు... ॥ చెఱకు ॥
పొంచలుచున్నయట్టి
పూపొదలకడ పొంచి తు
మ్మెదల నారివింట
గదలక సాధించి... ॥ చెఱకు ॥
రోసముచే గనులెఱ్ఱ జేసి మీసము వడి
వేసుకొంటూ వీరావేశముతో జెలగి
మేలైన త్రిశిరగిరి నేలు హరుని సఖుడౌ గో
పాలుడు నన్ను బాసిన
వేళ సందుజూచి... ॥ చెఱకు ॥

గీ. పతులబాసిన సతులను భంగపెట్ట
దలచితివి వారి యుసురెల్ల దాకదటర
ఆడుతోబుట్టుతోడ నీ నవవిలోన
బుట్టలేదటరా సరి పోర మదనా ?

పంచ. ధరాతలంబునందు గూర్మి
దంపతుల్ నెపంబుచే
బరాముఖంబుతోడ నుండ
బంచకన్నె చిల్కవై సె
క్కి రామలన్ బురింగొనంగ
గింకరుండు వచ్చె జూ
డరే పరాకులేక వాని
ధాక కెట్టులోర్తునే.

సీ. పదునైన యలుగుల పలుతూపు గలదంచు
దొడగకు నీ విల్లు పుడమి గలయ
పాంథుల భేదించు భటకోటి కలదంచు
జెలగకు నీ సేన చెట్ల గలయ
ఎట్టిని ముట్టెల గుట్టముల్ గలవంచు
బొంగకు నీ బల్మి బూది గలయ
విరహాలపై దండు వ్రలిగొల్ప నెత్తిన
నీ కేతనంబు మునీ్నట గలయు

గీ యెుటి నాటక బంటవై తుంటవింట
దంటగా దూపులై దింట నంటజేయ
గంటకంబున ముక్కంటి కంటిమంట
లంటి నీ తొంటి రూపంబు మంటగలసె.

దరువు. చెలియా నే నెట్లోర్తు నిక
జెలరేగె మరు డేమౌనో

నిలువనీయ డాయె, వీని బలము
    నీరై పోదాయె...     ॥చెలియా॥
కలికిరో యోచన లేక
    మెలగుట నిటులాయెనే
తులవ వానితో వాదేల ?
    నిలువ గూడ దిచ్చటను...     ॥చెలియా॥
క్రూరము బూనియు నాతో
    బోరుట మరియాదయేనా ?
సారసాక్షి తల్లినను
    విచారమేల లేదాయె...     ॥చెలియా॥
ధారుణి కుచేలపురి ధాముడైన నా మనో
హారుడింపు రాగ వీని
    భీరమడచక పోదునే...     ॥చెలియా॥

దూతి: అమ్మా యీ ధూర్తునితో మనకేల, దూషించినకొలది పెచ్చురేగును.

సత్య: నిజమే సఖీ! సామమున వానిని జిక్కచేసికొనవలె గాని, భేదముచే గార్యము గాదు.

చ. చెలువుడ, నేను కావుమని
    చేతులు నొగ్గినదానగాని క
క్షలుగలదానగాను విర
    హంబున జొక్కినదాన నాపయిన్

గటకుశరంబు లేల ? సుమ
కార్ముకమేల ? పికంబులేలరా :
చిలుకదళంబులేల ? వికు
శీతలదృష్టిని జూడు మన్మథా.

చంద్రదూషణ

బెలీ....యీ తెకతెక లేమే.

సీ. ఉదధినద్భుతముగా నుద్భూతిమై పెట్టి
బాడబంబా ఇది పద్మగంధి ?

దూతి : కాదు సఖీ నిశాకరమండలోదయం
బేకాని చపలాక్షి భీతిపడకు

సత్య : చంద్రమండలమైన సా- ద్రధూమంబు గ
న్పట్టె మానిని వింత రట్టదేమె ?

దూతి : విరహజనాళిని వెదగొల్పియున్న పా
తక ధూపమేకాని తరళనయన

సత్య : అప్పుటంబయినట్టి యతుల శిఖావళు
లదియేమి చిత్రమే అంబుజాక్షి ?

దూతి : అబల ఎరుంగవే ? అబ్ధిమిత్రోదయ
భాసుర రాగప్రభాకరంబు

సత్య : అలివేణినే నిటి యాశ్చర్య మెరుగవే
మిణుగురు లవియేమె ? మీననేత్రి:

దూతి : తత్ర్పభాగమ ఖిన్నతను జెందియున్నట్టి
తారకాగణము మత్తగజయాన

సత్య : ఇట్టి చోద్యంబు చూడలే దింతవరకు

దూతి : చందురుడెగాని భీతివి జెందకమ్మ

సత్య : చందురుండైన నిక దాళ జాలనమ్మ

దూతి : విభునితో నిన్ను గూర్చెద వెరవకమ్మ

దరువు

సత్య : చందమామ చందమామ ఓ చందమామ నా
సందిట నెలకొన్న ఓ చందమామ
ముత్యాలు పగడాలు కలపోసినట్లు నా
ముచ్చట లెల్ల విని పోవే చందమామ...
పాలను నీళ్లను గలపోసినట్లు నా
ప్రాణనాథుని గొనిరావె వేగ...

దరువు. నే తాళ లేనురా ఓ చందమామ ఓరి ॥నేతాళ॥
నే తాళగ జాలరా బాల నీ
వేళ నా పాలినిర్దయ నీ కేలరా ॥నేతాళ॥
హాలాహలానుజ నా లావు తెలియక
యీలాగు రవ్వ సేయ నేల్లాగు వేగ్గింతు ॥నేతాళ॥
వేసారి నన్నిట్లు దోసకారి మోహా
మీసము దిద్ది మందహాసము చేసెళీ

కం. హాలహాలము మూడులోక
మ్ముల నొక్కట వేల్చుచుండ మునుగని శివు డా
హాలమును గళమున నిడుకొని
తలదాల్చుట నిన్ను దుష్కృతముగాదె ? శశీ!

గీ. చెల్లబో చంద్ర నీరూపు తెల్లగాను
సురలు నిన్నప్పుడము రీతి విరిచి తినగ
వింగి చెలరేగి తిరిగెడు దొంగకొయ్య
యింత నామీద మత్సరంబేల చంద్ర!

సీ రాచకులమున బుట్టి రమణుల నేచంగ
నందమా చందమా చందమామ!
రాత్రిచరింపగ రాజందురా నిన్ను
నందెట దొంగవే చందమామ!
పర్వదినంబుల బాము విన్గరువంగ
నగమాయె నీరూపు చందమామ!
గురుని యిల్లాలితో గూడియుండిన నాటి
వింద చాలదే ? నీకు చందమామ!

అమరసంఘంబు నీ కళ లారగింపు
బతుల నెడబాపి సతులను బాధ పెట్ట
కమలవైరి భవత్కళల్ కరిగిపోయె
చలము మామీద నేటికో చందమామ!

గీ. వీని బాము గరవ వీడేల రాజాయె
పగలు లేనిచోట బగలు చేసె
మంట మారి వాడు మనకు దాపురమాయె
నేమి సేతునమ్మ యింతులార.

దరువు – హిందుస్థానీ కాఫీ – చాపు

సత్య : సరోజవైరి బాధకింక సైపజాలనే
ధరాధరుండుమనల దలచడాయెనే.

దూతి : మరాళగామినీ విభుండు మనసునందున
కరుణదలచి వచ్చునిటకు గలత జెందకు ॥మరాళ॥

సత్య : హరుండు వీని బ్రేమతో శిరంబునందున
ధరించినాడుగాన గర్వతనము దాల్చెనే.

దూతి : విరించిచే వరంబునొంది విశ్వమెల్లను
భరించునట్టి నీదు పతికి బావకాదటే.

సత్య : సతుంకంటె బావమరది హితుడ యౌనటే యీ
గతిని కూచిపూడి పుర శ్రీపతిని జూచితి.

దూతి : విలాసమైన కలహంసాడి యలగిపోయిన
చెలువు డిటకు జేరునిపుడు తెలియ చూడుమా.

సత్య : ఓయమ్మో పోయిన మాధవి రాదాయెనేమె - యీ చెలి
కత్తెలను నమ్మరాదే. నేను యేడువారములనొమ్ము లిచ్చి

నాను నమ్మిన చెలికత్తెగదా యని స్వామివారి చెంతకు పంపగా రాక జాగుచేయుచుండెను.

దూతి : అదిగో మన మాధవి వచ్చుచున్నది సఖీ!

సత్య : మాధవీ! క్షేమముగా వచ్చితివా ?

ద్విపద

మా : నన్ను నడిగినమాట నాతిరో వినుము
మన్నన నీ పనుల్ మరి చేయబోవ
నెండ వేడిమి గంది యుండె ముఖంబు
మెండు చెమ్మటతో మెలగె ముంగురులు
నతి వేగమున రాగ సతి కురుల్ వీడె
అతి చెమటచే తిల్కమ మట్టికుజారె
తడబడి నా పన్ను దగిలె పెదవికిని
జిడిముడి నే రాగ జిరిగె నా రవిక
ముడివేసుకొన బోవ వడిగోరులంటె
నుడివిన వెల్ల నువిదరో! నమ్మి
కోపంబు సేయక కువలయ నేత్రి
కృప జూడవమ్మ యో చపలాక్షి! ఇపుడు.

దరువు — దర్బారు — అట

సత్య : దూతికల నమ్మరాదె తోయజానన
దూతికల మరి నమ్మినందుకు నీతిలేదికమీకునెప్పుడు

కాంతరో ముమ్మాటికిని మోమాట
ముంచగరాదుపోవే.

మా : నాతిరో వినుమా దూతిక నేల నిటు బల్కఁదగునా
ఘాతలంబున నీతియుంగల దూతలేకను రాజునకు బ్రి
ఖ్యాతిగల్గునే ఓ తలోదరి! రౌతులేని రథము నడచునే.

సత్య : బొంకులాడెదవే నీ మదిని నిశ్శంకలేక
రంకునేర్చిన మగువ ననుచును పంకజాక్షిరో
చాలుపోవే.

యింక నేనిక నమ్మజాలను బింకములు
జూపించెదవు బల్.

మా : శంకలు మాను నామాట నమ్ము మింక మదిలోన
పంకజాస్త్రుని బాధకోర్వక బల్కఁదగునె
జనని జనకుల
పొంకమున మిము జూచువారల
రంకులాడుల జేసితివి భళి.

సత్య : నీ యంగరేఖలనుబట్టి యంటినిగాని వేరుగాదు చెలీ!
కోప ముంచక అచట జరిగిన వృత్తాంతము దెలుపవే
సఖీ!

మా : అమ్మా నీ నాధుని వైభవ మేమని జెప్పను. రుక్మిణీ
ప్రముఖ దేవేరులం గూడి కేళీవిలాప గతులమెలగు
చున్నంత నేబోయి నమస్కరించి నీ వృత్తాంతంబింతయు
నెరిగించితి. ఇంతలోనే...

ఉ. అంతట రుక్మిణీమణి యాడినమాటలనేమి
చెప్పుదున్
గాంతుడు చూచుచుండ గనులెఱ్ఱగ జేసి
మోము గం
పంతగ జేయుచున్న దరి పాటున నిక్కుచు
విఱ్ఱవీగుచున్
చెంతనున్న చేడియలచే నను జెంపలుగొట్టి
పొమ్మనెన్.

సారసాక్షి! నీనాథున కెన్నివిధముల విన్నవించినను రానసె నమ్మా.

దరువు - అటతాళం

సత్య : రానంటాడటే ? మంచిది మంచిది రాకుంటే
మంచిది రానేవద్దనవె
రామరో తా బ్రతిమాలితే రమ్మనేవా
రెవరున్నారు ॥రానంటా॥
ఇంతగట్టి మనసువాడు యింటికి
మునుపు రానేవె
దిమ్మరీడై అల్లవాడు తిరిగి చూడకున్నందుకు
కొమ్మరొ పదివేల కైనా వానితో పొందు
చాలునమ్మ ॥రానంటా॥
నే జెల్ల శ్రీకూచిపూడి రాజగోపాలునితోటి
రాజసమున రతిసేలిన రవ్వజేసి పంతగించి
॥రానంటా॥

హేసఖీ! స్వామివారు రాకున్న నీ చిలుక లేల? యీ హంస లేల? యీ కోయిల లేల? యీ అమూల్య వస్త్రాభరణంబు లేలనే?

మూర్ఛ పట్టు

దరువు. ఈ దోమతెర మంచ మీ హంస తల్పంబు
యీ మంచి గజనిమ్మ యెవతె జేరునో?
ఈ పీతాంబుర యీ మంచి సౌధంబు
లీ దివ్యభోగంబు లెవతె జేరునో?
అల చిలుకలార కోకిలలార తల్లులార
అల సత్యభామ యిల్లనిపించరమ్మా!
నా పాలిటికి మీరు మీ పాలిటికి నేను
ఈ పట్ల దయయుంచుడో ఇందుముఖులార!
ఎలనాగ నా నగరమేమి కొదువయు లేదు
చెలియరో పట్టెడన్నము దాన నేను.
నన్ను పట్టకుష్మ నలినాయతాక్షిరో
చెన్నకృష్ణున కర్పణము సేతు మేను.

దరువు. ఆడ పుట్టుకవంటి యధమపు బుట్టుక
ఏడేడు జన్మముల కిడి వలదె చెలియ ॥ఆడ॥
అత్త మంచిదనము అలవేముల తియ్యదనము
కత్తి మెత్తనిదనము కలదే ఓ చెలియ ॥ఆడ॥
తోడబుట్టిన వాడు తొంగి చూడకుంట
వాడవాడలవారు వగతురె చెలియ ॥ఆడ॥

మతిలేని విభుడై తే పఋమూరు సవతులు
తొత్తుగ జూతురు తోడికోడళ్ళు ॥అద॥
ఒకరింట బుట్టించి ఒకరి పాలుగ జేసి
కకవికలు జేయు బ్రహ్మకు కరుణలేదె
చెలియ ॥అక॥
యీ యాడపుట్టుక నెరి గల్పించిన బ్రహ్మ
అయ్యయ్యొ యిల్లులేక అడవిపాలుగాను ॥అద॥

గీ. మానంబు తొడవు సతులకు
మానము ప్రాణాధికంబు మానమఖిల స
న్మానములకు మూలంబగు
మాన రహితమైన బ్రతుకు మానిని కేల?

సీ. చికిలి చేసిన తమ్మి చిగురుకైదువ లెత్తి
తనువు నాటించరే తరుణులార!
తమ్మ తెమ్మెర దమ్మి కపురంబుతో బూని
నా మేన బూయరే భామలార!
విరుల గుండములోన వెరవక నురికెద
విరవొంద జూడరే యింతులార!
వెరవుగా వెన్నెల వేడిలో జడియక
చలమున జొత్తునో సఖియలార!

గీ. చిలుక తానేల మొగ మెత్తుచేయనేల
కాము డేటికి నన్నింత కాకుసేయ
ప్రాణవిభుడిందు రాకున్న ప్రాణములకు
నాశపడుదాన గానమ్మ అతివలార!

సీ. వెన్నెల చిచ్చులో వేగ నురికెద నన్న
నడ్డంబు రాకుడో యతివలార!
బాగుగా నెదనుపూబాకు గ్రుచ్చుకొనంగ
విడిపింపబోకుడో చెలులార!
తెగువతో బూదంత దీసి గళమున జుట్టుకొన
నడ్డుకొనకుడో కొమ్మలార!
ఓర్చి యిక ప్రాణముల్ మేన నుంచదరమె
వెనరుగా మీరు చెలువంగ విలువవశమె
మగడు యింతులపై దయమాలి యున్న
ప్రాణముల్ దాచనేల నీ ప్రాయమేల?

ద. ప్రాయమేలా వచ్చెనే అమ్మయ్యో యీ ॥ప్రాయ॥
ప్రాయమేలవచ్చె మోహమేల హెచ్చె
కాయజుని గన్న జక్కని సామి రాడాయె ॥ప్రాయ॥
నిబ్బరంపు మంచి శిబ్బెంపు వల గబ్బి
గుబ్బలు నాయెద నుబ్బి క్రిక్కిరిసేటి ॥ప్రాయ॥
ఎలమితో బొమ్మరిండ్లు గట్టుక అలికి
ముగ్గులమర బెట్టి
చెలరేగి పెండ్లిండ్లు చేసేటి వానికి
ఏలావచ్చెనే ॥ప్రాయ॥

(అని సత్యభామ మూర్ఛిల్లును. చెలికత్తెలు శైత్యోప చారంబులు చేసి సేద దీర్తురు.)

దూతి : మాధవీ! శ్రీ స్వామివారి చెంతకుబోయి అమ్మగారు

మూర్ఛిల్లినారని చెప్పి వెంటదోడ్కొని రావే. వేగబొమ్ము.

(శ్రీకృష్ణ స్వామివారు తెరలోపల)

40. మా : కృష్ణ వాసుదేవ కేశవ పరమాత్మ
అప్రమేయ వరద హరి ముకుంద
మిమ్ము జూడగంటి మీకృప గనుగొంటి
నఖిలసౌఖ్య పదము లందికొంటి.

(శ్రీ స్వామి తెరనుండి వెడలును)

41. కం. దండమయా విశ్వంభర
దండమయా పుండరీక దళనేత్రహరీ
దండమయా కరుణానిధి
దండమ యూ నీకునిపుడు దండముకృష్ణా.

42. శ్రీకృ: మాధవీ! మరలవచ్చితివేమి?

43 మా: స్వామీ ఏమిచెప్పుదును. శ్రీస్వామివారు రానన్నారని చెప్పితినో లేదో సత్యభామ వెంటనే మూర్ఛిల్లినది. ఎన్ని శైత్యోపచారములు చేసినను స్వస్థురాలు కాలేదు. ఆమె జీవించునని తోచదు. తమ దర్శనము అగుచో గొంత సేదతీరునేమో యని తమకొఱకు యిటకు వచ్చితిని.

శ్రీకృ : సరే - పోదము. పద.

(మాధవీ శ్రీకృష్ణుల నిష్క్రమణ)

## శ్రీ సత్యభామా కృష్ణ సమాగమము

45 మా: సఖీ సత్యభామా! శ్రీకృష్ణ స్వామివారు దయచేసినారు.

సత్య : నిజముగ వచ్చినారటే...

మా : అదిగో వచ్చినారమ్మా...

46 సత్య: సరే ఇప్పుడు సమయముగాదని చెప్పవే. ఎల్లప్పుడు వెడబాయకుండునట్టి రుక్మిణీదేవియొద్ద సెలవు పొందియే వచ్చినారా? దొంగతనముగ వచ్చినారా? ఆమె వలన నేమి మాటవచ్చునో వేగ పొమ్మని చెప్పవే సఖీ!

శ్రీకృష్ణ : లేని నేరములు మోపి నాకేల దూరమయ్యెదవు?

ద్వి. సావధానంబుగా సత్యరో వినుము
యెవరి సేమన్నావో యెరుగవా? నీవు
గొల్లవాడ నటంచు కులము లేదంచు
నెల్లలోకులు విన నీ వాడినావు.

దరువు

47. సత్య: ఎన్నిసేర్చినావురా ఓరి నా సామి ॥ఎన్ని॥
చిన్న మొన్నటిలోనే నెరజాణవై నీవు ॥ఎన్ని॥
ఎల్ల జనులు నిను గొల్లని పిలువగ
నే మన మందువో తెలియదు నాసామి.
వారిజాక్ష నీ వంచన దెలిసెర
చేరి యిరుగడల జెప్పిన భయమటర.

48. దరువు. భామనా సత్యభామనా ?

భామనా నాపేరు అల్ల భామరుక్మిణి ఓ సుపసున్న
ప్రేమ నడచియు నాదుచెంతకు సామి
నిమరప్పించకున్న ॥భామనా॥

మంచిదిర పదియారువేలమించు
బోడులలోను గొగి
లించుమని నీచేత బ్రతిమాలించుకోకుంటేను
సత్య ॥భామనా॥

కాని వేగడరోరి అల్లదాని నిన్ను బట్టి నలుగురి
లోను కాదనిపించి నీ యభిమానమును
దీయించకుంటే
లేమలందరు జూడ జడతో వేమరునిను
గొట్టకుంటే ॥భామనా॥

దరువు

49. శ్రీకృ : కర్పూరగంధితో గలియుటలేదని
నిప్పులైన బట్టెద ఓ భామ నిప్పులైన బట్టెద

సత్య : కామచిచ్చుముట్టి కబళించువానికి నిప్పులనగ
నెంతరా ?

శ్రీకృ : ఆ విరిబోణితో గలియలేదని నల్లగోవునైన
బట్టెద - ఓభామ

సత్య : ఏవేళ గోవుల గాచేటివానికి గోవు లనగ నెంతరా ?

శ్రీకృ : ఆ వనజాక్షితో గలియలేదని గొప్ప
పామునైన బట్టెద. ఓభామ! పామునైన బట్టెద.

సత్య : పాము మీద శీవి బవళించువానికి బాములనగ
నెంతరా ?

శీకృ : ఆ వనగంధితో గలియలేదని యల్ల
దేవరగుడిజొచ్చెద. ఓభామ। ।।దేవర।।

సత్య : దేవ రహస్యము తెలిసినవానికి దేవరనగ నెంతరా?

శీకృ : నమ్మి నాతల దవివి బాగుచేసినగాని
నమ్మవేమి సేతునే ఓభామ। నమ్మవేమి సేతునే

సత్య : కొమ్మ చన్నుగుడిచి రొమ్ముగ్రుద్దినవాని
నమ్మవచ్చునటరా?

మా : అమ్మా శ్రీస్వామివారు అనుగ్రహించి వచ్చినారు. వారిని బూజించుటము లెమ్ము. సఖీ। మరలవారికి మారాడి కలహము కొనితెచ్చుకొందువేల. పవనాంబుభక్షణులై తపమాచరించిన మునిజనులన్ దుర్లభుడగు పరమాత్మయే నీ చెంగటకు రాగా వానిని బూజించుకుండుట లెస్సగాను. లెమ్ము పూజింతము. అహంకారములు మాయలు దొలగించుకొని ప్రసన్నపూరుషుండగు శ్రీకృష్ణ పరమాత్మతో ప్రసన్నురాలవై ఐక్యము సిద్ధింపచేసు కొనుము.

సత్య : చెలులందరితో

. దరువు. బంగరుపూవుల నిన్ను బూజ సేతురా
శృంగారముగ గన్నుల నిండ జూతురా
చెంగల్వపూల దండలు మెడనిండ వేతురా
కూచిపూడి రాజగోపాల జన్మసాఫల్యము సేయుర్రా

( సమాప్తం )